# హనుమచ్ఛాస్త్రికథలు

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

కథలు :



12
అణాలు

సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# ప్రా స్తా వి క.

చిన్నకథలకు ఈనాడు పెద్దస్వాగతం! నవ్యసాహిత్యాంగములైన ఖండకావ్యం, ఏకాంకిక, కథానిక అనే వాటిలో—కథానిక అనబడే చిన్న కథకు ఎక్కడలేని ప్రాతినిధ్యమూ, ఆదరణా, ఈమధ్య ప్రజానీకంలో ఏర్పడ్డది. ముఖ్యంగా అనేకమంది యువతీ యువకులు అగపడడమే తడవుగా ఈకథానికావాఙ్మయాన్ని అందుకొని చదివి ఇంకనూ కొత్తకొత్త సంపుటాలకు ఆదరాంజలి ఘటించి ఆహ్వానిస్తున్నారు. ఈకథాభిమానం ఒక్క తెనుగుగడ్డలోనే కాదు. వంగ, ఘూర్జర, తమిళ, కర్ణాటాది దేశాలలో సైతం అగ్గలమైన వ్యాప్తిలో ఉన్నట్టు కనబడుతుంది.

ఆలోచించగా ఇట్లాతోస్తుంది. ఊపిరి సలుపని ఈ భౌతికయుగంలో స్తిమితంగా—ఆసనశుద్ధిగా కూర్చుని, స్వారస్యాలు తీస్తూ, పద్యవాఙ్మయాన్ని చదివే తీరికా, కోరికా, సంస్కృతీ, ఈనాటి ప్రజాసామాన్యానికున్నట్టు కనిపించడంలేదు.

కాని—

మానవమస్తిష్కం పాండిత్యసంస్కారరీత్యా ఎంత జఘన్యంగా ఉన్నా సాహిత్య కళానందాన్ని తన తాహతుకు తగినట్టూ కోరుతుంది. దాని వదులుకోదు.

కనుక—

దొంక తిరుగుడూ, అన్వయశైథిల్యమూ, భాషాబంధం, ఉన్న పద్య పారస్వతాన్ని పండితులకు వదలి ఈనాటి ప్రజాసామాన్యం వచన వాఙ్మయాన్ని వరించింది.

కథకూ వచనానికీ అవిరళమైన అనుబంధం. వచనంలో వ్రాసిన కథాగ్రంథాలే—పూర్వపువైనా ఇప్పటివైనా—మంచి వ్యాప్తిలో ఉన్నాయి. కాబట్టి ముందు వచనం, తర్వాత కథా, పాఠకలోకపు మనస్సును గట్టిగా ఆకట్టగలుగుతున్నాయి.

ఇప్పుడు ప్రజల్లో ఎట్టిసంచలనం పుట్టించవలెనన్నా, ఎట్టిభావ విప్లవం తలలకు ఎక్కించ దలచుకొన్నా, వచనమూ, కథా గొప్ప ఆయుధాలు. రష్యన్ కథకులు స్ఫులింగాల్లాంటి తమచిన్న కథలతో ప్రజా హృదయంలో ఎంతటి జ్వాలాతోరణాలు వెలిగించిందీ తజ్జ్ఞులకు విశదమే. మపాసా తన కథలతో జాతిలో ఎంతటి తుఫాను లేవదీసిందీ వేత్తలెరుగుదురు.

ఆంగ్ల, వంగసాహిత్యాలు రచనా విధానంలో (Technic)—నిజానికి—మన చిన్నకథలకు మేలుబంతులుగా నిలిచి మెరుగులుదిద్దాయి. అంత మాత్రం చేత మనకి చిన్నకథ రచనపూర్తిగా కొత్తదనుకోవడం పొరపాటు.

సంస్కృత సాహిత్యంలో ప్రసిద్ధకథా గ్రంథాలైన పంచతంత్ర, విక్రమార్క—చరిత్ర, దశకుమార చరిత్రలలోని ఒకొక్క—కథ కొంచెం నిశితంగా చూస్తే ఒకొక్క శుభ్రమైన చిన్నకథ అవుతుంది.

అయితే—మన పూర్వకథలలో వస్తుకల్పనా చాతుర్యమూ, ఇప్పటి కథలలో మనః ప్రవృత్తి వైవిధ్యమూ ఎక్కువ ప్రాముఖ్యము వహించి కథారూపమును మార్చివేశాయి. కాని కథాగమనమునూ, నిర్వహణమునూ పరిశీలించిచూస్తే రెండిటికీ ఉన్న పోలికలు స్పష్టపడతాయి.

అగ్నిపురాణంలో ఒక గద్యకావ్యభేదానికి కథానిక అని పేరు. దీని లక్షణమునూ ప్రాచీననవీన కథాసంచయమునూ, జోడించి చూడగా చిన్నకథలన్నిటినీ కథానికలనడమే ఎక్కువ ఉచితంగాతోచి దాని సామంజస్యాన్ని చర్చిస్తూ సుమారు 6 ఏండ్లకిందట ప్రతిభలో 'కథానిక' అనే ఒక వ్యాసంప్రచురించాను. దానితో అంతకుముందు చిన్నకథకు పర్యాయపదములుగా వాడుకలోకి తేబడుతూన్న కథానకం, హ్రస్వకథ, పొట్టికథ అనే మాటలు నశించి భారతి మొదలైన సాహిత్య పత్రికల్లోనూ పలువురు కథకుల వ్యవహారంలోనూ కథానికాశబ్దం నిరూఢమయింది.

కాగా—

ఇటీవల కొందరు విశిష్టమైన చిన్నకథను కథానకమనడమే సమంజసమనీ ఆలంకారిక నిర్వచనాలలో కథానికా శబ్దానికి ప్రాధాన్యం లేదనీ అంటున్నారు.

కాని—

పైమాటలు అక్షేశక్తి మంతములు కావు.

ఎందు చేతనంటే—సామాన్యతః ప్రచలితములయ్యే అలంకారిక గ్రంథాలలో అసలు గద్యవిభాగాలకే ప్రాధాన్యంలేదు. వాటిలో కథానిక చెప్పబడక పోయినా అలంకారిక మూర్ధన్యులు అంగీకరించే అగ్ని పురాణంలో దీనికి సలక్షణమైన నిర్వచనముంది. కనుక దీని సామంజస్యాన్ని శంకించడంలో ఔచిత్యంలేదు.

ఇక—

కథానక శబ్దాన్ని ఏ ఆలంకారికులూ నిర్వచించి స్మరించినట్లు నేను చూడలేదు. ఒక భేతాళ పంచవింశతిలోతప్ప. ఆ పంచవింశతి అలంకార శాస్త్రమని నేననుకోను. అదేమైనకు పరిమప్రమాణమైతే విక్రమార్క చరిత్రలోని ఒకొక్క కథను ఉపాఖ్యాన మనిపేరు. కనుక చిన్నకథను ఉపాఖ్యాన మనడమే సమంజసమని ఎందుకనగూడదు? ఇట్లా అభిప్రాయ శాఖాచంక్రమణానికి అంతులేదు గనుక ఇప్పటికి దేశంలో బాగావ్యాప్తమైన కథానికాశబ్దమే చిన్నకథకు సరియైన పర్యాయపదమనీ ఈ రచనకు సంస్కృత సాహిత్యంలోనే గట్టిపునాదులున్నవనీ మనం నిశ్చయంగా గ్రహించవచ్చు.

ఈ నాడు దక్షిణ అన్ని సారస్వతాలలో వలెనే సుమారు పాతికేండ్లనుంచి ఆంధ్రసాహిత్యంలోకూడ అనల్పమైన కథానికా రచనసాగుతోంది. శ్రీగుడిపాటి వెంకటచలం, వేలూరి శివరామశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలైన ఉత్తమ కథారచయితలు విజృంభించి తెలుగు కథా సాహిత్యానికి గొప్పదీప్తితెచ్చి భావవిప్లవానికి, నవ్యజాగృతికి, నూత్నసంస్కారానికి విశేషంగా తోడ్పడ్డారు.

నేడు ఉత్సాహశీలురైన మరికొందరు యువకథా రచయితలు ఈ చిన్నకథను సాధనంగా తీసుకుని జాతిచైతన్య వికాసానికి బహుధాకృషి చేస్తున్నారు.

నేను సుమారు 7, 8 ఏండ్ల ఈమధ్య అప్పుడప్పుడు వ్రాసి ఆంధ్రవార పత్రిక, భారతి, ఉగాదిసంచిక మొదలైన పత్రికల్లో ప్రకటించిన కథల్లో కొన్నిటిని ఇప్పుడు తొలిసంపుటంగా ప్రచురిస్తున్నాను. వీటిలో కొన్నిటిని సమాజంలోని కుళ్ళును కదిపి, ప్రజల దృష్టిలోకి తేవడానికి ఉద్దేశించాను. కొన్నిటిలో ఒక్కొక వ్యవస్థలోని విచ్ఛిత్తి విశేషములను చూపడానికి సంకల్పించాను. కొన్ని కేవలం శిల్పంకోసం, వైచిత్రికోసం వ్రాయబడ్డవికూడా ఇందులో లేకపోలేదు. వీటిలో ఏకొన్ని అయినా సరసుల మనసులను కదపగలిగితే నా ప్రయత్నం కొంతవరకైనా చరితార్థం అవుతుంది.

సాహిత్య ప్రియులైన దేశీయుల ఆదరాభిమానాలు లభిస్తే తక్కిన కథాసంపుటాలు అచిర కాలంలోనే ప్రజలఎదుట నిలుస్తవి.

ఈకథానికా ప్రచురణకు అవకాశమునూ ప్రోత్సాహమునూ కల్పించిన శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారి యెడల కృతజ్ఞుడ నవుతున్నాను.

రామచంద్రపురం.
14—5—44

హనుమచ్ఛాస్త్రి

# వివాహ మంగళం

రాత్రితొమ్మిదవుతుంది. గృహలక్ష్మి వంటిల్లుసర్దుకుంటోంది. గిన్నెలు, చెంబులు చప్పుడుతోపాటు వరవిక్రయం, వందే మాతరం పాటముక్కలు పగిలిన గ్రామఫోన్ ప్లేటుముక్కల సంగీతంలా వినబడుతున్నాయి.

వేసంకాలం. ఆకుఅల్లాడ్డంలేదు. కుర్చీ, టేబిలూ, కాగితాలుపెట్టుకొని వీధిలోకూచున్నాను. ఏదో రాద్దామని.

“ఇదిగో ..ఇందాకా మీతో చెప్పడంమరచిపోయాను. సాయంత్రంమీకోసం మామామయ్య వచ్చాడు. అతనికొడుకు ప్రకాశానికి పేటలోఎల్లుండిపెళ్లిట. తప్పకుండారావాలని మరీ మరీ చెప్పివెళ్లాడు.”

చట్టున తలెత్తిచూశాను. నుదుటిమీద చెమటలో తడిసి అంటుకున్నతలవెంట్రుకలను సవరించి, కట్టుకున్న పాతగళ్ల చీరచెంగుతో చేతులుతుడుచుకుంటూ మాఆవిడ సాక్షాత్కరించింది.

“అట్లానా—చాలా బాగుంది. ఇన్నాళ్లూ నీపెట్టెచెరలో దుఃఖించే వెండిచెంబులికీ, సిల్కుచీరలకీ మంచివిడుదల. పోనీపాపం—ఈవిధంగానైనా రెండుమూడురోజులు వెలుగు చూస్తాయి.”

“మీరందురూ—నిత్యమల్లెపువ్వులా నిగనిగలాడుతూ—మీఆక్షేపణల కేంగాని, ప్రయాణం మాటఏమిటి?”

పిల్లలికి మరోనాలుగు చొక్కాలు—నాకో రెండు చీరలూ, ఒకసబ్బుబిళ్లపెట్టే, చిన్నపిల్లాడికి ఒకబూడ్సుల జతా........."

జాబితా అట్లాపెరిగిపోతోంది. నేనందుకున్నాను. "నా కమీజులకు మరోకఫ్సులజత—ఒకషేవింగుసెట్టూ, రెండు సిగరెట్ టిన్నులూ, ఒకఅమ్రాండస్తా........."

ఇద్దరం నవ్వేశాం.

"అమ్రాండస్తా ఎందుకూ" నవ్వుతూనే కోపంగాఅంది.

"పెళ్లివారికి పనికొస్తుంది" ధీమాగా అన్నాను.

"మీారంతకన్నా ఎక్కువబహుమతులిస్తారనుకోలేదు."

"పాత్రదానం"

గిరుక్కున తిరిగి వెళ్లిపోతోంది, ఇంట్లోకి.

రసశాస్త్రప్రకారం అదిసరసమో, విరసమో, చెప్ప జాలనుగాని, ఆవిడతో అట్లాపేచీపెట్టుకోవడం, పుల్లవిరుపు మాటలనడం నాకో 'రిలీఫ్'. నెమ్మదిగా లాలించి వెనక్కి పిలిచాను.

"నవ్వేటాలకన్నదీ నిజంగాఅన్నదీ గ్రహించక, అట్లా చిందులు తొక్కుతావేం? ఇలారా.........తప్పకుండా వెడదాం, రేపుమధ్యాహ్నంరైలుకు. రేపుబజారుకి వెళ్లేటప్పుడు ఏమేంకావాలో చెప్పు.........అయితే పెళ్లిఎన్నాళ్లు?"

పాపం! అల్పసంతోషి! ప్రియంగా ఒక్కమాట ఆడితే చాలు, 'సీదా' చల్లబడిపోతుంది!

"అయిదురోజులు చేస్తారట. అవతలివారు చాలాభారీ మనుషులు. ముద్దుముచ్చట్లు బాగాతీరుస్తారు."
చాపదగ్గిరగా లాక్కుని తృప్తిగా కూచుంది.

పాపం! ఈఆడవాళ్ళకి పెళ్ళికివెళ్ళడమంటే ఎంతసరదా! ఈమురికిగుడ్డల్లోంచి—అంటతప్పాలాల్లోంచి, విసుగెత్తే రోజువారీబతుకులోంచి కొత్తలోకంలోకి వెళ్ళినట్టుంటుందిగాబోలు—హిస్టీరియావాళ్లూ, కడుపునొప్పివాళ్లూ, ఎప్పుడూ ధుమధుమలాడేవాళ్లూ, ఇట్టేమారిపోతారు పెళ్ళిళ్ళలో.

శుభ్రమైనబట్టలు, సెంట్లు—కలకల లాడుతూ ఉత్సాహంతో గంతులేస్తూ కనపడతారు. ఔనుపాపం! వాళ్లకి క్లబ్బులా, సభలా, స్నేహితులా, పికార్లా!—దరిద్రగొట్టు వంటిల్లు, రోగిష్టిపిల్లలు, కసురుకొనేమొగుడు—ఎంతనరకం అనుభవిస్తున్నారు—తెనుగుకుటుంబాల ఆడవాళ్లు!

పెళ్ళికివెళ్లడమంటే నిజంగా నాకూ నిజంగాప్రాణంలేచి వచ్చింది. ఈమధ్య సజీవమైన—రసవంతమైన పెళ్లేచూడలేదు. తిరుపతి మొక్కుబడికివెళ్లినట్టు యానాంవెళ్లి తిండికిమొహం వాచి యెకాయెకీ బళ్లల్లోనలిగిచచ్చి—ఛా—ఏంపెళ్లిళ్లు! నిజంగా తెనుగుకుటుంబాల పెళ్లిమాధుర్యమే చచ్చింది. ఈ కక్కుర్తికల్యాణాలు చిన్నప్పుడు చూచినపెళ్లిళ్లు తలచుకుంటే ఒళ్లు పులకరిస్తుంది.

పెళ్లిపందిట్లో అడుగుపెట్టేసరికి చల్లని కొత్తతాటాకుల వాసన—ఇంట్లోఅడుగుపెడితే వడివడిగా తిరిగేశృంగారవతుల

జడలలోని మరువంవాసన—నట్టింట్లో తివాసీలమీద పిల్లలు ఒలకపోసిన పన్నీటిమంచిగంధంవాసన—పెరట్లో గాడిపొయ్యి దగ్గర కొత్తచాపలమీద రాసులుగా గుమ్మరించిన ఉడికిన కూరగాయల వాసన—కళాయిలో పడుచుహృదయంలోని ప్రేమలా తెగమరిగే తియ్యనిసంతర్పణ పులుసువాసన—మొత్తంమీదపెళ్ళి ఎంతసువాసన!

పందిట్లో శుభప్రదమైన ఆనన్నని సన్నాయిపాట—కొత్తచీరల కవకసలతో, మెడగందపూతలతో—కొత్తగా కాపరానికి వెళ్ళివచ్చిన మరదళ్ల, మేనగోడల్ల హాస్యాలు—ఏవీఇవ్వాడు? అంతాపూర్వవాసన అయిపోయింది. వేమలకవి పద్యం జ్ఞాపకం ఒచ్చింది.

"అలరునకుబోలె నాహృదయమ్మునకును
జన్మమునకొక్కటే వికాసమ్ము చెలియ!"

వెనువెంటనే నాపెళ్ళిసంగతులు కళ్లల్లో స్ఫురణగా తిరిగాయి.

ఎప్పటిమాట! సుమారు పదేళ్ళవుతుంది.

౨

తొట్టిలోపిల్లాడు కదిలిఏడవడంతో నాభావనాచక్రంఆగింది. చాపమీద కునికిపాట్లు పడుతూన్న మాఆవిడ ఉలికిపడిలేచి చంటిపిల్లాడిదగ్గరకి వెడుతూ "ఏమి టలాగే కూచున్నారు? దీపంకాగడాలా వెలుగుతోంది. కాగితాలు ఎగిరిపోతున్నాయి.

ఇదేనా రాత? లేవండి, రేవు రాసుకుందురు గాని......"
అనినవ్వి వెళ్లిపోయింది. ఉదయం కళ్లనులుపుకుంటూ నేను పక్కమీదనుంచి లేచేసరికి, మాఆవిడచేసే కంజాయింపు బహు కట్టుదిట్టంగా వినబడుతోంది. పిల్లలికి ఒంటిమీద నీళ్ళు పోసి, తలలుదువ్వి, చొక్కాలుతొడిగి, పువ్వుల్లాతయారు చేసింది. తుడిచినగదులూ, మడిచినబట్టలూ, నిన్నటికన్న అతి పొందికగా కనబడుతున్నాయి. కాకులుకుయ్యకుండానే తియ్యని పొగలుకక్కే కాఫీసిద్ధమయిపోయింది. ఇక—శుద్ధాంతంలో అడుగుపెట్టేసరికి—శుభ్రమైన ఉప్పాడచీర, ఊదాసిల్కు జాకెట్, తలనిండాపువ్వులు, ఉదయసూర్యుడంత కుంకుంబొట్టు తో మాఆవిడ కాఫీగ్లాసుపట్టుకొని ఎదురొస్తోంది. అప్పుడు స్ఫురించింది. ఓహో—ఈవేళమంగళవారం, పేటపెళ్ళికివెళ్ళాలి. మధ్యాహ్నం మూడుగంటల రైలుప్రయాణానికి ఉదయం ఆరు గంటలనుంచి సన్నాహం. బహుదూరదృష్టిమనిషి మాఆవిడ.

ఆఫీసుకువెళ్లి అధికారివేసిన యక్షప్రశ్నలకు జవాబు చెప్పు కొని హిందూదేశానికి స్వరాజ్యం తెచ్చినట్టుగా నాలుగు రోజులు సెలవుసంపాదించాను. మామీదపగకొద్దీరైలు ముందే వచ్చిరహస్యంగా వెళ్లిపోతుందేమో అని పదింటికే భోజనాలు చేసేశాం. ఎంతకీమూడుకావడంలేదు. మాఆవిణ్ణి పిల్లల్నిపట్ట శక్యం కాకుండాఉంది. వాళ్లను 'ఎంగేజ్' చేసేమార్గం కన బడ్డంలేదు. పరుపుకట్టడం ఏడిపేసట్టుందనీ, ట్రంకుపెట్టెలోంచి బట్టలు తొంగిచూస్తున్నాయనీ, సూట్ కేస్ తాళం కనపడ్డం

లేదనీ 3 గంటలదాకా నోటితో పనిచేసి ఎట్టకేలకు ఒక వేణ్ణీళ్ల థెర్మోఫ్లాస్కూ, చన్నీళ్ల మరచెంబూ, రెండుపెట్టెలూ, నాలుగు పరుపుచుట్టలూ, వగైరాలతో శృంగేరీ శంకరాచార్యపీఠంలా బయలుదేరి సకాలానికి రైల్లోపడి సాయంత్రంఅయిదుగంటలకు పేటచేరుకున్నాం.

## 3

మొగపెళ్లివారు ఉదయమే సదరుగ్రామం దయచేసి స్నాతకం వగైరాచేసుకుని విశాలమైనవిడిదిమేడలో 'క్యాంపు' ఖాయించారు. పదిహేను, ఇరవై మధ్యవయస్సుగల కుర్రజాతి పేకటపాటపా కలిపి పంచుగుంటూ గోలచేస్తోంది, ఒక అరుగుమీదచేరి. వృద్ధులు—భోజనాలు పొద్దుపోయాయి గావును—మేడకిందహాల్లో ఇంకాదొర్లుతునే ఉన్నారు. మేం గుమ్మంలో అడుగుపెట్టేసరికి "అరుగో—శర్మా, సత్యవతీ, పిల్లలూవచ్చా"రని పెళ్లిపెద్దలు, ఆడవారూ, మగవారూకూడా మాకుస్వాగతం పలికి "మీకు బస, మేడమీద ఏర్పాటుచేశాం. పైకిపదం" డన్నారు.

సామాను పట్టించుకుని నరాసరి మేడపైకివెళ్లి ఒక శుభ్రమైన గదిలో సర్దించాను. తిరిగిచూస్తే మాఆవిడ 'పత్తా' లేదు. పోలీసుచేతులోంచి తప్పించుకు పారిపోయిన జన్మఖైదీలా స్వజనంలో కలిసిపోయింది. మళ్లాఇంతట్లో పట్టుకోవాలంటే బోలెడంత సిబ్బందీ కావాలి.

రైలుప్రయాణంలో ఒళ్లంతా నలగ్గొట్టినట్టుంది. దక్షిణం వైపు కిటికీలోంచి గాలిరివ్వున విసురుతోంది. బెడ్డింగువిప్పి కాస్తనడుంవాల్చాను. అనతిదూరంలో వున్న పెళ్లివారిపందిట్లోంచి శ్రావ్యమైన సన్నాయి 'మరుగేలరా ఓరాఘవా' పాడుతోంది. చిన్నకునుకు పడుతోంది. గదిలోకి ఇంకోసామాను వస్తున్నచప్పుడు కళ్లువిప్పిచూశాను. సామానువెనక ఒక ఆయనవచ్చాడు. వయసు 'చత్వారింశత్' దాటివుంటుందని నిశ్చయం. కళ్ళకుఖరీదైన కొత్తరకంఫ్రేముకళ్ళజోడు. క్లోజు కాలరుకోటు దానిమీదసన్నని బంగారపువాచీగొలుసు మెరుస్తూ వేలాడుతోంది. గుమ్మటంలాటిశరీరం. కుంకుంబొట్టు. తల తిలతండులన్యాయం చూపుల్లో సౌజన్యం కంటె అధికారం ఏలుబడిచేస్తోంది. మీసాలులేవు. నాకుఎదురుగాఉండే గోడవైపు ఎక్కడ ఏసామానుసర్దవలసిందీ వెండికట్టుబెత్తం మొనతో చెబుతున్నాడు. అయిదునిమిషాల వ్యత్యాసంలో ఆయన వెంటనే ఒక ఇరవైయేళ్ళచక్కనిఅమ్మాయి కాలిముఖమల్ జోడు నెమ్మదిగాచప్పుడుచేసుకుంటూ లోపలికివచ్చింది. కణ్వమహర్షి వెనకాల వచ్చిన శకుంతలలాఉంది. ఉపమానం తప్పే. మో—వైట్‌రోజ్‌తలనూనె వాసనతోగూడా ఆమెజడలోని దవనంవాసన గుప్పునకొట్టింది. చప్పునతలఎత్తిచూశాను. కనకాంబరంరంగుసిల్కుచీర కట్టుకుని, ఇంగ్లీషురంగుజార్జెట్‌జాకెట్ తొడుక్కుంది. శీతసూర్యకిరణాలు మామిడిచిగురుమీదపడి

వెలిగేవింతరంగు ఆమెశరీరానిది. ఆకళ్లెత్తిచూస్తే అక్కడ ఇంద్రధనస్సులు పండుతాయి.

మల్లిపువ్వులూ, మామిడిపండ్లూ, వేసితెచ్చిన ఖద్దరు చేతిసంచీ సామానుపక్కనుపెట్టి గదినాలుగ్వైపులాచూసింది. ఎందుకో—

ఆయన కోటువగైరాలువిప్పి రెండుతువాళ్ళుతీసి ఒకటి కట్టుకుని ఒకటిపైనవేసుకుని సబ్బుపెట్టెపట్టుకొని వెడుతూ "రమణయ్యగారు ఇంకారాలేదా" అన్నారు ఉచ్చైఃస్వరంగా. ఏదో ఆలోచిస్తున్నాను. 'నిన్నే. మాటాడవేం' అన్నట్టు నావైపుచూశారు. ఆయనకు గవర్నమెంటులో ఏదైనా ఉద్యోగమేమో—

నేనులేచికూచ్చుని భయభక్తులు తెచ్చుకునిఅన్నాను. "చిత్తం. తెలియదండి. మీకుగాని......కనబడితే...... కాస్త........దయచేసి నేనుగూడా వచ్చానని వారితో చెప్పండి........'

పుష్కరం ఈమధ్య ఆగవణయ్యగారెవరో నేనెరగను. నామాటలోని కొంటెతనం ఆవిడగ్రహించిందిగాబోలు ఒకసారి నన్నువింతగాచూచి నవ్వాపుగుంది. ఆయనస్నానానికి, ఆవిడ మేడకిందకి వెళ్ళారు.

చీకటిపడుతోంది. మొగపెళ్ళివారితాలూకువారు తండ తండాలుగా మేడంతా ఆక్రమించారు. మాగదికూడా మరి కొన్ని ముతాలతో నిండిపోవలసిందేగాని వారిదీ, మాదీకలసి

సామాను నాలుగుకుటుంబాలకు సరిపడావుంది—కనక మరి ఎవరూ ఇందులో జొరబడలేదు—కొంచెంచల్లగాలిలో తిరిగి రావచ్చునుగదాఅని ఊరిచివరికివెళ్ళి అటూఇటూతిరిగి సుమారు ఎనిమిదిగంటలకు విడిదిచేరుకున్నాను.

మాఆవిడా, ఆకొత్తమ్మాయీ లోకాభిరామాయణం అందుకున్నారు. ఎంతోకలుపుగోలుతనంగా ఆఅమ్మాయి మా పరుపులకు జేరబడి పకపకనవ్వుతూ మాటాడుతోంది.

సుముహూర్తం పదింటికేట. ఈలోపున ఊరేగింపు కూడా అయిపోవాలి. చప్పునభోజనాలు పూర్తిచేసుకుచక్కా వచ్చాం.

ఊరేగింపునుంచి తిరిగివచ్చి పల్లకీ పెళ్ళివారిపందిట్లో ఆగింది. సమయానికి చేతిలోఉన్న బాకానసవరించి దూదేకుల సాయబు ఆకాశంపైకెత్తిపట్టేస్తున్నాడు. నిద్రపోతూన్నపిల్లలు హడిలిపడిలేచి ఏకగ్రీవంగాఏడవడం మొదలు పెట్టారు. బాండు వాళ్ళు అప్పుడే 'సునోసునో' పాడిఆపారు. సుముహూర్తానికి వెళ్లాం. లోపలికివెళ్లేహాలులో మేజువాణీ జరుగుతోంది. నా వయస్సు వాళ్ళంతా ఆప్రాంతంలోనే సర్దుకుంటున్నారు.

"రావోయిశర్మా! ఇటుఇటు" అని అందులోంచి ఒకఆప్తబంధువు పిలిచాడు. "శర్మఫొక్సు ఏంటీనాచ్—పిలవకురా బాబూ" అనిఒకడు.

సుమారు పదేళ్ళయింది భోగంమేళంలో కూచుని. పాపం—ఈకళావతుల్లో కళ ఏనాడోపోయింది. అక్కడికివెళ్ళి

ఏంబావుకోవాలి. పౌడర్లు, రంగుచీరలు, సిల్కురవికలూ కప్పిన రోగిష్టిశరీరాలను చూచి చప్పరించడంతప్ప. అథవా—ఒకసారివెళ్ళికూచున్నా ' ఈదేహం అమ్మకానికి—వలయువారు......" అన్నవేవో జ్ఞాపకంవచ్చి కళ్ళనీళ్ళపర్యంతం అవుతుంది నాకు. సైలన్లు, డ్రెస్సులు, హోటలు సెక్స్లుగదా ఈనాటి రసికులు. అణాకాసికి దగలాగి ' ఈతపళ్ళ ' పాటలుపాడించి నిర్భాగ్యులంతా యీమధురమైనసంస్థను చంపేశారు.

తలవంచుకొని లోపలికినడిచాను ఒహో—ఏమినేత్రనిర్వాణం! విశాలమైన ప్రాంగణంలో బాగా అలంకరించిన వివాహ మండపం!

కుడివైపున నాగరిక వేషంతో కూచుని అత్తరుపన్నీరూ, తాంబూలాలూ, విరివిగా ఉపయోగిస్తున్న లౌక్యులు. బంధుకోటీ, పెళ్ళిపీటకు ఎదురుగుండా ఒక బ్రాహ్మణసముద్రం. విసనకర్రమేఘాలు దానిమీద అతిజోరుగా ఆవరిస్తున్నాయి. పూచిన తంగేడుపొదల్లా స్త్రీజనంయొక్క నల్లనిజడలూ, తెల్లనిమల్లెచెండ్లూ ఆప్రాంతాన్ని ఏలుతున్నాయి.

ఈ పేట స్త్రీలపద్ధతే వేరు—

రాచ్చిప్పల్లో, మడిబట్టల్లో కొట్టుకునే బ్రాహ్మణకుటుంబాలలో తప్పబుట్టారు. ఎంతఉత్సాహంగా చురుగ్గా కళకళలాడుతూ ఉంటారనీ! ముప్ఫైనలభై ఏళ్ళ ఆవిడకూడా చీరారవికా ఎక్కడామాయనీయకుండా, కడిగినముత్యంలా తయారై బయ

టూవస్తుంది. కనుకనే ఆడపిల్లో ఏ శుభకార్యానికి పిలిచినా మహాసరదాఅవుతుంది వెళ్ళడానికి.

నేనుఒకచోట చదకిలబడ్డాను. బ్రాహ్మణోత్తములు అర్థం తెలియని వేదమంత్రాలు హోరుపెడుతున్నారు.

"మదర్థంకన్యాం వృణీష్వ"— పెండ్లికుమారుడు మొహం ఎరగని ఒక బ్రాహ్మణ్ణపిలిచి పానలాచేతిలోపెట్టి నాకోపెళ్ళి కూతుర్ని చూసిపెట్టమన్నాడు. బ్రాహ్మణుడు అక్షతలుదులిపి డబ్బులురొంటినిదోపి లేచినచోటే కూచున్నాడు. అట్లానలు గురు పాపంఒక్కరూ ఆఅబ్బాయిమాట వినలేదు. డబ్బుతిని దగాచేశారు.

ఆఇంటి 'యజమాని' నుంచినాడుగనుక అతనిమీద దయ గలిగి, పట్టుబట్టలు కట్టుకువచ్చి అతనికెదురుగా కూచుని మా పిల్లను నీకిస్తామన్నాడు.

"కన్యాం కనకసంపన్నాం కినకాభరణై ర్యుతాం దాస్యామివిష్ణవే తుభ్యం......" అన్నీఅబద్ధాలు పిల్లఒంటి మీద ఒక్కనగకూడా కనపడ్డంలేదు. జడలోనాగమల్లిపువ్వులు తప్ప— వెయ్యినూటపదహార్లు రూపాయలు మగపెళ్ళివారు కట్నంగాగుంజినతర్వాత నగలపెట్టవలసినపూచీ ఆయనకే ముంది. ?

"ధర్మార్థకామేషుత్వ యైషా నాతిచరితవ్యా "కన్యాదాత అన్నాడు— మహాఅర్థంతెలిసినట్టు "నాతిచరామి" సంస్కృతం ముక్కలునోటపట్టని అబ్బాయిచేత పురోహితుడనిపించాడు.

సభలో కూచున్న వృద్ధులూ, ముత్తైదువలూ సాదరంగా స్పృశించినమీదట—మంగళసూత్రం చేత్తో పట్టుకుని పెండ్లి కొడుకు

" మాంగల్యతంతునానేన మమ
జీవన హేతునా కంఠేబధ్నామిసుభగే......"

అంటూ, తెల్లనికళ్ళతో చూచి అమాయకంగా మెడఒప్పగించే పెళ్ళికూతురు మెళ్లో కట్టాడు. ముడిపడింది—

నాకళ్ళలో ఎందుకో నీళ్ళు తిరిగాయి. అబ్బ—ఎంతతియ్యని ముడి! ఎన్నాళ్ళకూ విడరానిముడి! సుఖదుఃఖాల్లో—నవ్వు ఏడుపుల్లో నులివెచ్చని కౌగిలింతల్లో—ఒకరివెంట ఒకర్ని బలంగాలాగేముడి! దీనిబాధ్యత దీనిలోని అనంతమాధుర్యం ఈపూపపిందెలకేం తెలుసు?

తెలిస్తే—వెంటనే—నును కొత్తసిగ్గుతో ఒకరినొకరు చూసుకొని, ఎంతహాయిగా—తీయగా నవ్వుకొనేవారు.!

మనస్సులో సముద్రపుటలల్లా ఎన్నో ఊహాలు. ఈగ్రంధి—చేతులకూ మెడకూనా?—ఛా! ఎంతవిరూపఘటన! రెండుపక్వ హృదయాలలోను స్నేహతంతువుల ముడి—ఎప్పుడో—ఎక్కడో—ఋషుల ఆశీర్వచనాలలో పుట్టినపవిత్ర వివాహ సంస్థ తుదకిట్లా తేలింది.? నిద్రకూరుకువస్తోంది. లేచి విడిది మేడవైపునడిచాను. మేడమీదదీపాలులేవు. హాల్లో ఇద్దరు చంటిపిల్లలుగావును నిద్దరోతున్నారు.

తడుముకుంటూ గదిలోకి వెళ్ళాను బట్టలు మార్చే ఓపిక లేదు. పరుపు కోసం వెదికాను, నిద్రమత్తులో తూలుతూ. పరుపు చక్కగా పరచి ఉంది.

అప్పుడే వచ్చి శయనించింది గాబోలు మా ఆవిడ. మొగాళ్ళకన్న ఓర్మిబద్ధకం ముసిపి—పిల్లలతో తగువుపడుతూ ఎక్కడో కూచుని చక్కావచ్చి ఉంటుంది.

పరుపు మీద ఒరిగాను. పెళ్ళివారు రాసిన దిల్ బహార్ సెంటుతో నాలాల్సి పరిమళిస్తోంది. తీరా పడుకుంటే......నిద్ర రాదు. దొర్లుతున్నాను.

పెండ్లి వారింట్లోంచి చల్లగా ఇంకా పెళ్ళిమంత్రాలు వినబడుతున్నాయి.

"సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః" నాకు నవ్వొచ్చింది. రెండు నిమిషాలు గడిచాయి. మెత్తని తామర తూడువంటి చెయ్యి ఒకటి నా మెడమీద పడింది. బంగారు గాజులు చిరుతచప్పుడు చేశాయి. ఆమృదుస్పర్శకు నా నరాలన్నీ భగ్గుమని వెలిగాయి. శరీరం జరుగుతోంది. మెదడు తిరగబడుతోంది. ఎంత చిత్రమైన అనుభవం.

పెళ్ళిపచ్చ కర్పూరపు తాంబూలంతో పరిమళించే వెచ్చని నాలుగు పెదవులూ, ఉద్రేకంగా కొట్టుకునే రెండు హృదయాలు అతిదగ్గరగా కలుసుకున్నాయి.

పెళ్ళిమంత్రాలు ఇంకావినబడుతున్నాయి.

"సఖాస ప్తపదా భవ సఖాయౌ......

సఖ్యాత్తే మాయోషగ్ం సఖ్యాన్మేమాయోష్ఠాః"

నేనుబయలుదేరినచోటునుంచి తోవతప్పి ఏగంధర్వలోకంలోని దేవకన్యక ఒడిలోనో పడ లేదుకద !

ఆబాహువులాళపు సుఖస్పర్శ—పెదవులు కలిపేనేర్పు— ఏజన్మలోనూ పరిచితమైనట్టులేదు. ఆమత్తులోంచిలేచి ఆలోచించే త్రాణలేక బుద్ధిగిలగిలా కొట్టుకుంటోంది.

హఠాత్తుగా తెల్లగులాబికలనూని తీవ్రపరిమళంతో నాతల తిరిగింది.

---

# అందని ఆశలు

(శ్రీ ఇంద్రకాంతి ఘోష్)

## 1

వరదరాజు హఠాత్తుగా ఒకసారి రైల్లో నే నెక్కిన కంపార్టుమెంటులో కనబడి అన్నాడు—'భాయీ, సరిగ్గా ఇప్పుడే అనుకున్నాను నువ్వెక్కడ కనిపిస్తావేమో అని—నావూహా మొలిచినట్టు—తల యెత్తేసరికి నువ్వు ప్రత్యక్షం! నాకు తెలును—నే ననుకున్న దట్లా జరిగి తీరుతుంది, ఉత్సాహాతిరేకంవల్ల ఉత్తమజాతి సిగరెట్ ఒకటి 'ఆఫర్' చేసి—'విశేషాలేమిటోయ్' అనే అసాధారణ ప్రశ్న వేశాడు.

ఆప్యాయంగా అంటించి, అనుక్షణంలోనే ఒక సుగంధిల మేఘమండలాన్ని సృజించి వాటిమధ్య ఆలోచించడం మొదలు పెట్టాను.

కాబోలు—నా అనుభవం దీనికి పరమ వ్యతిరేకం—నే ననుకున్న దేదీ అనుకున్నట్టు జరక్కపోవడం నా నిత్యకృత్యం—ఎప్పుడూ నేను కోరిన కోరిక ఎదురుచూచిన తోవ వెంటనడచి రాలేదు. మానవ జీవిత మన్నా ఆశాభంగ మన్నా—నా నిఘంటువులో ఒకటే అర్థం—

ఆదరించవలసినమిత్రులు అవమానించారు. అనతిదూరంలో ఫలిస్తా యనుకొన్న ఆశలు ధ్వంస మైపోయాయి. హృదయ

మంతా నివాళిగా పట్టి ప్రేమించిన ప్రియురాలు నునుగాలి కెరటాల్లో తేలి జారిపోయే—సువాసనలా—సంగీతంలా—చేయి జాపినకొద్దీ దూరమై—చిరునవ్వుతో కరిగిపోయింది.

ఈ అప్రాప్తకాంక్షలతో—అశాంతితో—కుమిలి జాలిగా—భస్మం కావలిసిందేనా ?

కాదేమో—దగ్ధహృదయాలకు ఆపంత ఊరటను—ఈష న్మాధుర్యాన్ని—నయంతో అందించే రసనదవస్థ యేదన్నా వుంటుందేమో—ఆత్మశక్తికి అసాధ్యం లేదంటారే—

తర్వాత మూడేండ్లనాటి మాట—

## 2

దూరపుబంధువులు ఒకరు ఒకరాత్రి 'డిన్నర్ పార్టీ' కి పిలిచారు, సరిగా ఎనిమిది గంటలకు.

అదే సమయానికి ఒక పెద్దమనిషివచ్చి, 'వరల్డుపాలిటిక్సు' చతుష్షష్టి కళలూ సావకాశంగా నాతో చర్చించడానికి 'ప్రాణా నాయమ్య' అని కూచున్నాడు.

భోజనంమొహం ఎరగనట్టు విందుకోసం ఇంటికివచ్చిన పెద్ద మనిషిని పంపివేయడమా ? ఘరానామనుషులతో కాలంవిలువ తెలీని అనాగరికుడులా ప్రవర్తించడమా ?

'సమస్య' తెగలేదు.

ఆయనపుణ్యమా అని పాపం ఆజనమేజయ మహారాజు—ఆట్టేసేపు నన్ను చంపకుండా తనంతతానే వెళ్లిపోయాడు.

సాధ్యమైనంత త్వరలోనే నాప్రసాధనం పూర్తిచేసుకుని గంతవ్యం చేరుకున్నాను.

లోనికి ప్రవేశించగానే, ఆ దివ్యభవనపుగోడ గడియారం 8½ ను సూచిస్తోంది. హంత!

లోపలి వరండాలో నించుని, కిటికీలోంచి హాలులోకి చూశాను. ఓహో! కూరలు—పులుసులు ఉండలు—నలిగి—బద్దలై పొట్టల్లోకి పోతున్నాయి.

ఆ రసవత్కుంగాలోకి చొరబడనా—లేక ఇంటికి తిరిగిపోనా? ఇది కూడా ఒకసమస్యే! అక్కడే నిలుచుని ఆలోచిస్తున్నాను. కిటికీలనుంచి దూసుకువచ్చే 'పెట్రోమాక్స్' కాంతుల్లో నా తెలిపట్టుపంచా—జరీ సిల్కుకండువా—నన్ను చూసి నవ్వుతున్నాయి. హీనంగా ఎదుటి శూన్యాన్ని చూస్తున్నాను—

# 3

పక్కతలుపొకటి చప్పుడయింది.

చటుక్కున ఎవరేనా వచ్చి—నన్ను ఇబ్బందిపెట్టి—లోపలికి తీసుకువెడితే—మీరా—ఎంత సేపయింది వచ్చి—ఆలస్యం చేశారే—అని విషపు నవ్వు నవ్వితే—పోదామనుకున్నాను. కాని, అవతలివారికి ఎంత అవసరమో... పైని గొళ్లెం వేసివుంది. చుట్టుపక్కల ఎవరూ లేరు—వెళ్లి గొళ్లెం తీసి, పక్కకి తప్పుకున్నాను. తలుపులు మెల్లగా విడ్డాయి.

ఏమిటిది! ఆశ్చర్యంతో నాతల గిర్రున తిరిగింది. 'కలయో వైష్ణవ మాయయో' అన్న పద్యం నాగొంతులో హోరు పెట్టింది.

రైలులో ఒక అప్సరస ఎంతోసేపు నీపక్కను కూర్చుని ప్రయాణం చేసిందనుకో—ఆమె నీ ఊపిరిబంధించి—కళ్లల్లో వెలుగులు చిమ్మ—నవ్వనవ్వకూ—నీప్రాణసారాన్ని తోడడం ఊహించు—ఆమె అకస్మికంగా ఒక 'స్టేషన్' లో నీవైపు చూడకుండానే దిగిపోయింది. అప్పుడు నువ్వు మల్లెపూలు తీసివేసిన బుట్టలా అయిపోయి, విలువైన వస్తువును అజాగ్రత్తవల్ల జారవిడుచుకున్న వాడిలా ఏడ్చావుగదూ— కొన్నాళ్లకు తలవని తలంపుగా ఆ దేవకన్య నీమార్గంలో ఎదురుపడి చిరునవ్వునవ్వితే—తన అతిలోక లావణ్యాన్ని నెమలి పురిలా నీయెదుట ఇంకొక్కసారి విప్పితే—ఏమౌతావు? సరిగ్గా అదే ఇప్పటి సంఘటన—

ఒక్కచూపులో — నాజీవనశాంతిని కలవర పరచినవి ఈ కుంకుమపూవు పెదవులే—పరిమళ ధూమరేఖలా వేలాడే అదే కత్తిలాంటి జడ—మాఘమాసపు మల్లెపూవులోంచి జారిన పచ్చి వెన్నెల బిందువువంటి ఈ చిరునవ్వే—నా నిరంతర తపస్సుకు తీరనికోరిక—నాకళ్లల్లోని స్వర్గమే నాయెదుట తలవంచుకొని నడుస్తోంది. తలయెత్తి చూశాను.

"శర్వాణి!" ఇక్కడి కెట్లావచ్చింది!

నేను ఆలస్యంగా రావడానికీ ఈలావణ్యనిధి హఠాత్తుగా ఒకతలుపులోంచి వూడిపడడానికి ఏమిటి సంబంధం? దైవమన్నా—యోగమన్నా—అదృష్టమన్నా ఇదేనా? కొమ్ములు తిరిగిన దార్శనికులు దీనికోసమే తన్నుకుని ఛస్తున్నారు—

కాటుకకళ్ళతో ఒకసారి బరువుగా నావైపు చూచి, రెండు మూడడుగులు వేసింది. నీలం అంచుల కొత్తసిల్కుచీర స్వచ్ఛత్వం—మెడలో ఘుమఘుమలాడే మంచిగంధపు చారికలు—అశ్రద్ధగా పెట్టించుకున్న పెద్దకుంకుమబొట్టు సౌందర్యరేఖ—ఆమె నవయౌవనశోభకు కళావ్యాఖ్యానాలు.

## 4

"వాణీ!" ఆగింది.

"ఇంతలో—ఇంత అప్రయత్నంగా నిన్ను చూస్తాననుకోలేదు." వుత్సాహంతో కంఠం తొట్రుపడింది.

కళ్లతో నివారించింది. అక్కడ మాటలాడడం ఇష్టంలేదని వూహించాను. ఆమె రసజ్ఞ దేవత—ఔచిత్యమూర్తి—ఎక్కడ ఎంత మాటలాడాలో తెలుసు.

సాభిప్రాయంగా ముందుకు నడిచింది. అనుసరించాను. ఇంటి మెట్లుదిగి, చరచరా రోడ్డుమీదికి వచ్చాం. దీపస్తంభాల మసక వెలుతురు కొద్దిగా రోడ్డుమీద పడుతోంది.

ఒకటి—రెండు కుక్కలూ—ఒకరిద్దరు మనుషులూ మాత్రమే తోవలో ఎదురుపడి, మమ్మల్ని బెదురుగా చూచి వెళ్లారు.

చటుక్కున ఆగి అన్నాను—

"పెండ్లి అయిన వెంటనే...అత్తవారింటికి వెళ్లిపోయా వనుకున్నాను"

ఆమాటకు పండిన మొగలిపొత్తిలోని మెత్తని లోపలి రేకులా ఆమెముఖం నునుసిగ్గుతో పరిమళించింది.

మరోప్రశ్న "మగ అధికారం చలాయించకుండా, స్నేహంగా నీ సౌకుమార్యానికి తగినట్టు మృదువుగా ప్రవర్తిస్తున్నాడా?"

నా ప్రశ్నలోని గిలిగింతను ఆమె గ్రహించి వుండాలి.

"ఓ—యస్, చాలా ఖులాసాగా వుంటాడు స్నేహితుడు లాగ—మంచివాడు."

ఈజవాబు రాగూడదని నా ఆశ—వస్తుందనుకుంటే, ప్రశ్నించకేపోయేవాడిని.

లోకంలో వేసేకుశల ప్రశ్నలన్నీ ఇట్లాంటివే గాబోలు—'అంతా బాగున్నారా? పిల్లలా? జీతం వృద్ధయిందా?' అన్నప్రశ్నలకు అవతలివాడు కోరేజవాబు 'ఏంబాగు—మొన్నటిది అదలా అయిందా? రాబడికన్న ఖర్చు ఎక్కువయి గిలగిలలాడిపోతున్నానుగదా—నువ్వు అదృష్టవంతుడివి.'

అంటే వృచ్ఛకుడి సంతోషం పొంగుతూ ముఖంలో కనబడు తుంది.

ఆమె, తన భర్త నిర్భాగ్యుడనీ—విరసుడనీ తన కతని మీద ఇష్టం లేదనీ నీవంటివాడు ఏపుణ్యశాలినికో దొరుకు తాడనీ' అంటే ఇంకా ఆమె పట్ల జాలిపడి—అతన్ని తిట్టడంలో తోడ్పడి—నాసహృదయత్వాన్ని ఎక్కాలల్లో గుణించి—ప్రేమను పెంచి మాట్లాడివుందును. ఇదీలోక యాత్ర. ఈ 'జెలసీ'ని ఏ వుపనిషత్సరసమూ—కళాపరిజ్ఞానమూ—సహృదయత్వమూ జయించలేవు గాబోలు—

"చాలా సంతోషం (అబద్ధం).

ఇన్నాళ్లకు నీకు కోరుకొన్న భర్త దొరికాడు. అతని సహవాసంలో—ప్రేమలో నువ్వు సుఖపడుతూంటే అదే పదివేలు" ముఖం వెలవెలను వెకిలినవ్వుతో కప్పడానికి ప్రయత్నించాను.

సెలవిచ్చి నవ్వింది—

చన్నైన పడుచుపిల్లను మగసి ప్రసంగంలో తియ్యగా నవ్వించగలిగినప్పటి ఆనందంమాత్రం అనుభవించాను.

"సిగ్గొచ్చి నవ్వింది చిలకశర్వాణి" అను కవిత్వం వెలిగించాను.

పౌర్ణమీ చంద్రకిరణపు గిలిగింతలో తులికే పాలసముద్రపు లేతకెరటంలా గదలి, ఆమె నా బుజానికి తగిలేటంత దగ్గరగా వచ్చి, నా కళ్లల్లోంచి గుండెల్లోనికి చూస్తూ

"ఎంతదూరంలో వున్నా—ఎప్పటికీ—మీ మాటల్లోని హాయిని—చమత్కారాన్ని మరచిపోలేను."

ఆశకు, నాకు మళ్లా పునర్జన్మ వొచ్చింది.

ఈ ఒక్కమాటకోసమే—ఎన్ని అవమానాలనో—ఎన్ని దుఃఖాలనో—నిరాశలనో తొలగించుకొని బతికాను.

మనస్పూరా ప్రేమించిన పిల్లనుంచి వచ్చే మెప్పును—చిరునవ్వును—మాధుర్యాన్ని అనుభవించడంలో వుండే కైవల్యాన్ని — ఈ రూపాయిగా పైసలఘటాలకూ — ఒంటెద్దు బండి యాత్రీకులకూ—ఎవరు విప్పిచెప్పగలరు ?

ఆ ఇంటి ముందర రాధామనోహరం తీగల చాటున—మంచి సంగీతపు చివరికళలా...ఆమె చీర కొంగైనా కనపడుతుందేమో అని—దూరానికి విసరే జాజి సువాసనలా—ఆమె గొంతులోని మాటైనా వినపడు తుందేమో అని—చేసిన సుధాజ్వాలా భయంకర నిరీక్షణలోని రుచిని ఏ మానవుడికి బోధపర్చగలను ? మళ్లా ప్రకృతిలో పడ్డాను.

"వాణీ ! భయంలేదు—మరచిపోగలవు. అతని కాగలింతల్లో—సంసారంలో—పాత్రసామగ్రిలో పడి—తప్పకుండా...'

చటుక్కున నోరు మూసింది.

"అబ్బ — వుండండి. ఈ వేదనతో — ఈర్ష్యతో—మీమృదుత్వాన్ని—సౌజన్యాన్ని చంపకండి—పోనీ ఎక్కడికీ వెళ్లను. మీతోటే వుంటాను. ఇప్పుడు—వెంటనే—ఎక్కడికి వెడదామో చెప్పండి. చప్పున మీకూ నాకూ రెక్కలు

పెట్టండి— మీ ఉద్యోగం—మెంబరుషిప్పులు— పుస్తకాల గుట్టలూ...తగు మనిషితనం—అంతా ఒక్క ఊపులో ఎగరగొట్టి, నా వెంట రండి—మీ భావసౌధాల తలుపులు తీయండి—అక్కడకూడా కొత్వాళ్లకు ఇద్దరం ఒకరికి ఒకరు పాత్రై—విసుగై—దేశవాళీ భార్యాభర్తలమై—ఈసడించుకుంటూ బతుకుతామేమో—దరిద్ర వివాహ యంత్రం ఇట్లాగే తిరుక్కుంటూ ఒస్తోంది.

దూరంగా వుండి—ఒకరినొకరు ఆకర్షించుకుంటూ—ఎడబాటులోని తియ్యని బాధను—అందని ఆశలకోసం పడే—వేదనా సుఖాన్ని—అనుభవిస్తూ విధిచూపిన తోవల్లో—సురక్షితంగా ప్రయాణం చేద్దాం—

వరప్రసాదంగా దొరికిన ఈ ఉత్తమ నిమిషాలను శుష్క తర్కంలో వృధాచేసి ఏంప్రయోజనం?" పెదవులు అదురుతున్నాయి. నీళ్లు నిండిన కళ్లతో నవ్వింది

ఔనేమో—రంగు రంగుల ఇంద్ర ధనుస్సౌందర్యం—తన చేతికి దొరకలేదని ఏడిస్తే—ఆకాశపునీలం—వసంత లావణ్యం—తన ఒడిలో పడలేదని తపిస్తే—ఏం లాభం?

ఋతువుల్లో—కాలాల్లో—సుకుమార సుందర లోకాల్లో—కాలూనకనే పరుగెత్తే ఉత్కృష్ట శోభను—ఒక్కడు దాచుకోవాలంటే సంభవమా? దుర్భరం—ఈ అపూర్వ శుభయామినిలోని నిమిషాలకోసం ఎంత తపస్సుచేశావో—బ్రతుకంతటికీ ఏ రెండు రోజులో సుపర్వదినాలు—తక్కినవన్నీ పూర

బస్తాలు. చూసుకో—ఈ త్తరక్షణంలో ఈ జీవన మాధుర్య మంతా కరిగిపోతుంది. తెల్లవారితే ఏముంది? చవట పుస్త కాలూ— శుష్క పాఠాలూ— నీరస నీతులూ... అంటోంది అంతరాత్మ "నేను తొందరగా వెళ్లాలి."

"ఎలక్ట్రిక్ షాక్ తగిలినా అంత బాధగా వుండదేమో— నిమిషం పోతే—శర్వాణి నుంచున్న చోట శూన్యం ఆక్ర మిస్తుందని వూహించితే బాధగా వుంది.

ఆమె కదిలింది.

"ఉండవూ—ఇంకొక్క నిమిషం నీ శరీరపు లావణ్యాన్ని— మెడ వంపులోని అందాన్ని—కళ్లల్లోని మేఘసందేశాన్ని—తనివితీరా చూడనీ—నీ వీణాకంఠం కదిపి రెండు మాటలు—పాడు—"

ఇంకా దగ్గరగా జరిగి గట్టిగా— తుదిగా ఆమెను గుండె లకు ఒత్తుకుందామని తలిచాను. గ్రహించిందేమో—దూరంగా జరిగి, సానుభూతిగా నవ్వుతూ "మిమ్మల్ని నేను అపార్థంచేసు కోను—నాలోనూ వుంది జ్వాల—కాని... ఈ శరీరం ఇంకొక రిది—హృదయం ఎప్పుడూ మీది—దీని కృతజ్ఞతకూ— సన్నిధికీ మీరు పాత్రులు" అంతే—శలతిప్పుకొని ప్రక్క రోడ్డుకి గాదుగా—చీకటిలో కలిసిపోయింది.

టక్కున నాకాలి కేదో తగిలింది.

స్మృతి వచ్చి, కళ్లు తెరచి చూశాను. ఎదటి వాస్తవికతలో నిల్చినవి రెండు—కాలికి కొట్టుకున్న మంచపుకోడూ—గోడ మీద వేలాడుతూన్న అమృతాంజనం కేలండరూ.

# 6 నెంబరు గది

ఇటూ అటూ కొండలు. మధ్యని బస్సుప్రయాణం. జూన్ నాలుగో తారీఖు. కనపడే ప్రతికంకరగుట్టా ఒకఅగ్నిపర్వతమై కూచుంది. ఎండ, నిప్పులు చెరిగిపోస్తోంది. తలకిందులపక్షులు చెట్లనుంచి రాలి పడుతున్నాయి.

రజోగుణప్రధానంగా బస్సు పరుగెత్తుతోంది.

కంథవరం లోకల్ ఫండు సత్రందగ్గర బస్ ఆగింది. ఒకరిద్దరు ప్రయాణికులు దిగిసామాను సత్రంఅరుగుమీదికి చేరుస్తున్నారు.

నాకింక ప్రయాణంచేసే ఓపిక లేదు. నాలిక తాటితాండ్రలా రసహీనమైపోయింది. శరీరం నిప్పులోంచిపైకి తీసినట్టుంది. మావాడుఅప్పుడే ఒక 'లెమన్‌క్రష్' పుచ్చుకుని, పట్టణ సమానీత 'ఖారాకిల్లీ' ఒకటి ఎడంబుగ్గని వదిలపరచి, పత్రిక విప్పాడు, తక్కిన 15 మైళ్ళప్రయాణానికీ బద్ధకంకణుడై. ప్రయాణాల్లో మాత్రం మావాడు, "ఆరియు తేరిన వృద్ధ మూర్తి." నేనో వట్టి మెతక. నాసీమ బాపతు.

మావాణ్ణి ఎట్లాగో బతిమాలి, అప్పటికి ప్రయాణం ఆపి, మర్నాడువుదయం బస్సులోప్రయాణం చెయ్యడానికి ఒప్పించాను.

పెట్టెలు బెడ్డింగులు దింపి సరాసరిసత్రంలో ప్రవేశించి, మంచిగదిలో సామానుసర్దించి గుమాస్తాను కుశలప్రశ్న చేసి

మాట్లాడుతున్నాడు మావాడు. వాడికా ప్రాంతమంతా కొట్టిన పిండి.

నేను ముఖం కడుక్కుని, గుమస్తాగారి కూజాలోని మంచి నీళ్లు సగానికిపైగా పీల్చి, వడగొట్టినప్రాణాన్ని గదిలోవరుపు చుట్టకు చేరవేసి ఒక 'పాసింగ్ షో' వెలిగించి స్తిమితపడుతున్నాను.

'హల్లో' అంటే 'హల్లో' అనిఒకరినొకరు పలకరించుకొని మావాడు, మరోఆయన ఖులాసాగా మాటాడుకుంటూ గదిలో ప్రవేశించారు. కొత్తాయన పచ్చగా — పల్చగా చాకులా వున్నాడు. కొత్తతరహాకళ్లజోడు, చేతిలో లెదర్ బాగ్ ఉంది. రైల్వే నావెల్ లా చవగ్గా సరదాగా మాటాడుతున్నాడు.

మావాడు ఉభయపక్షాలపరిచయం చేశాడు. "ఈయననాకు ముఖ్యస్నేహితుడు. ఇన్స్యూరెన్సు ఏజంటు. పేరుగణేశంగారు. సరదామనిషి. సంగీతంమీద చాలా అభిమానం"........ "ఈయన మా అన్నగారు ఫలానా. బహుశాఎరిగేఉంటారు.

ఆధునికమర్యాదగా ఉభయులం నమస్కరించుకుని-అంతా లోకాభిరామాయణంలో పడ్డాం. సిగరెట్లహోమం పూర్ణాహుతిగా సాగుతోంది. ప్రణయకలాపం మొదలు పోగాకు పన్నుదాకా మాఇష్టాగోష్ఠి పరిగెత్తుతోంది.

గణేశంగారు సిగరెట్ పీకెను బయిటికి విసరడానికి ద్వారం దాకా వెళ్ళితిరిగివస్తూ తలుపువైపు ఆశ్చర్యంగా-నిదానంగా

చూసి పక్కన నవ్వాడు. ఎందుకల్లా నవ్వుతున్నారు అన్నాడు మావాడు కుతుకంగా. గణేశం మళ్లానవ్వి అన్నాడు. "చూశారూ, తలుపుమీద నంబరు 6. సుమారు సంవత్సరం కిందట ఇక్కడ ఒకచిత్రంజరిగింది. తలుచుకున్నప్పుడల్లా నవ్వొస్తుంది." అని నావైపుతిరిగి "అన్నగారూ, సమయస్ఫూర్తి చెప్పవలసివచ్చినప్పుడు ఆడవాళ్లదండీ—ఒక్కొక్క క్రిటికల్ సిట్యుయేషన్‌లో స్త్రీఒక ఠస్సావేసిందంటే బ్రహ్మాభేద్యంగా ఉంటుంది. లేకపోతే ఆనాడు నాథవిష్యంపోయి, అమర్యాద పాలైపోయి ఉండునంటే నమ్మండి. "ఏంజరిగిం దేమిటండి" అన్నానుకుతూహలంగా పరుపును జేరబడ్డవాడను లేచికూర్చుని.

గణేశం కొత్తసిగరెట్ సంధించి దాని అంచుకు సవరించి అంటించి 'ఏం జరిగిందంటే' అని ఉపక్రమించాడు.

## 2

ఒకసారి మాకంపెనీ ఆర్గనైజరు మంగపతిరావు నాయుడుగారూ నేనూ నెలరోజులు ఈసత్రంలో మకాంవేశాం. ముందుగానేనూ తర్వాతవారంరోజులకు ఆయనావచ్చి, చెరోగది లోనూఉన్నాం. ఆ ఎదురుగాకనపడే తూర్పువైపు పెద్దగదిలో నా బస. బిజినెస్‌కోసం నానాశ్రమలూ పడ్డాం. మానాయుడు భీమావిషయంలో మహాఘటకుడు. ప్రజలు త్రిప్పినన్నాళ్లూ తిరిగి చివ్వరికి పాతికమందిని పడగొట్టి, సుమారు ఏభై వేల దాకా బిజినెస్ చేయించి నాతో అన్నాడు. "చూశావా

పంతులూ! ఈ వ్యాపారంలో పట్టుగుంటే మరి వదలగూడదు. ఇదే పప్పుదప్పళం బ్రాహ్మడైతే విసుగెత్తి పారిపోను" అని విజయశంఖం ఊదాడు.

నిజానికి మానాయుడికి బ్రహ్మద్వేషం లేదు. మంచి సాయిలా ఫాయిలా మనిషి. బ్రాహ్మణ యువకుల్లోని నిర్వ్యా పారత చూస్తే అతనికికోపం. వింతమనిషి లెండి. సంగీతమంటే ప్రాణం. కవిత్వమంటే తిట్టేవాడు.

ఆ వేళతో మాబిజినెస్ అంతా పూర్తిఅయిపోయింది. వ్యాపారంపట్ల పెద్దపులిలా మీదపడేనాయుడు ఆరోజున నవ నీతంగా మారి పరమహుషారుగా ఉన్నాడు. తెల్లవారితే ప్రయాణంకట్టి విశాఖపట్నం వెళిపోతాడు. ఆరాత్రి— ఈ నెలరోజుల్లోనూ స్నేహితులైన చుట్టుపట్లవారిని నలుగురినీ పోగుచేసి తనగదిలో గానా బజానా ఏర్పాటుచేశాడు. ఈ నాటి మార్కెట్టులో చెలామణీఅయే తెనుగు హిందీ సినిమా పాటలు తూర్ణంగా పాడే ఒకకుర్రాణ్ణి సంపాదించి తీసుకువచ్చాను నేను. నాయుడు గదిఅంతటా మంచిరకం అగరువత్తులు వెలిగించి, బత్తాయితొనలు, ఏపిలుముక్కలూ, బిస్కెట్లూ రెండుమూడు పళ్లాల్లో అమర్చాడు. పైనాపిల్, విమ్టోరోజ్ ఇత్యాది డ్రింకులు రెండుకేసుల్లో సిద్ధంగాఉన్నాయి. చుట్టల కట్టలు, సిగరెట్‌టిన్నులు వగైరా ఉత్సాహసామగ్రి 'జాగర్త' పరచాడు. నేనేపనైనా ముట్టుగోపోతే మీరుశ్రమపడితే నేను ఒప్పను. మీరుకూడా నాకీవేళ ఒకవిలువైన అతిథిగాఉండాలి

అనినవ్వుతూ ఆజ్ఞాపించి ఆసంగీతపుకుర్రాడికి కీ ఇచ్చి విడిచి పెట్టాడు. వాడు 'నిద్రమేలుకోరా తమ్ముడా' మొదలు 'సుఖ్ కే దుఖ్ కే' దాకా అమృతప్రవాహంలా—తారాజువ్వలా పాడుకుపోతున్నాడు.

మిత్రులంతా డ్రింకులు సేవిస్తూ పొగలుకక్కుతూ తన్మయంగా సంగీతంలో తలమున్కలై వింటున్నారు. చీమకదిలితే వినబడుతోంది. ఈ సంగీతకోలాహలానికి—ఎక్కడినుంచి వచ్చి పడ్డదో ఒకజనప్రవాహం గదిలోకి కొట్టుకువచ్చింది. అంతా ఒకసైజు కుర్రాళ్ళు. షరాయిలు, గళ్ళలుంగీలు, లాల్చీలు, చేతుల్లేని బనీన్లు అంతా నవనాగరికజాతి. క్రితంరోజున అనకాపల్లినుంచి పెళ్ళివారొకరు నాలుగుబళ్ళతో వచ్చి సత్రంలో దిగారు. ఇప్పుడుమనం కూచున్న ఈ ప్రాంతం అంతా పెళ్ళివారితో నిండిపోయింది. వారంతా ఏదో పెద్దకుటుంబాలకు చెందినవారు. స్త్రీలూ, పురుషులూ చాలా 'స్టయిలిష్' గా ఉన్నారు. అవి బాణసంచాలుకావు, ఊరేగింపులు కావు, మేజివాణీలు కావు, ధణు తెగరగొట్టేవారు. రాత్రి ఒకరెవ్వ పాటు నిద్దరలేదు. పంచాగ్నిమధ్యంలా వారిమధ్యని నాగది ఉండిపోయింది. కాని, తెల్లవారింతరవాత వారందరినీ చూస్తే రాత్రి నిద్రలేనికోపం మంచులా విడిపోయింది.

మా నాయుడు పెళ్ళివారికుర్రాళ్ళని సగౌరవంగా 'రిసీవ్' చేసుకుని బహుధా సత్కరించి కూర్చోపెట్టాడు.

పాట మధుసేవలా నరాల్లో నిషాపుట్టించి ఎవ్వరినీ కదల నివ్వడంలేదు.

ఉత్తరంవైపు హాల్లో పెళ్ళివారి ఆడవారు నవ్వులతో హాస్యాలతో మహాహడావిడిగా సాగించే బంతులాటకూడా పూర్తికావచ్చింది. ఒక్కరొక్కరే లేచి వెళుతున్నారు. గాస్ లైట్లు మసకగా వెలుగుతున్నాయి. నాకునిద్రకూరుకువస్తోంది. నాయుడుగారు చూస్తే కదలనివ్వరు. దగ్గి ఇవతలకి వచ్చి నా గదివైపు జారాను.

# 3

నిద్రకళ్ళతో వెళ్ళి నా గదితలుపులు తోశాను. తలుపులు విడుతూండగానే తలతిరిగిపోయేటంత సన్నజాజిపూలవాసన గుప్పున కొట్టింది. నాకుప్రాణంలేదు. నెళ్ళాళ్ళనుంచి ఈన త్రగపు కొయ్యబల్లలమీద నిర్బంధబ్రహ్మచర్యం ఆచరించే నాగది లోంచి ఈ 'మగువపొలువు దెలుపు నొక్కమారుతం' ఏమిటి?

నిద్రకళ్ళను బాగా తెరవడానికి ప్రయత్నిస్తున్నాను. ఒక వేళ నాయుడుగారి గదిలోనే ఉండి పాటసుఖంలో తియ్యని కలలు కనడంలేదుగదా! అనుకున్నాను.

కళ్ళువిదలించి మళ్లా నిదానంగా చూశాను. సందేహం లేదు. ఎదటకనబడేది చక్కని పదహారేండ్ల అమ్మాయి. సన్నని తెల్లజరీచీర కట్టుకుంది. జడనిండా జాజిపూలు. గోడ

వైపుతిరిగి కాంపుకాటుమీద పరుపుదులిపి పక్క వేస్తున్నది. హరికేన్‌లాంతరు ఒకటి బాగా తగ్గి వెలుగుతోంది.

ఇదేమిటి? ప్రవరాఖ్యుడి ప్రాణానికి వరూధినిలా నామార్గంలో ఈవిడెట్లా వచ్చిపడ్డది? ముప్పావుగంటకిందట తలుపులు దగ్గరగా చేరవేసి వెళ్ళినగదిలో ఈఅప్సరస ఎట్లా పుట్టుకు వచ్చింది? ఈ తలలోని ప్రశ్నపరంపరలతో ఆలోచిస్తూ అప్రయత్నంగా నాలుగడుగులు గదిలోకి వేశాను.

"అమ్మయ్య—సంగీతం ఇప్పటికే నా మిమ్మల్ని విడిచిపెట్టింది" అని తిరిగిచూచి హఠాత్తుగా నోటమాటరాక నివ్వెరపడిపోయింది. నేనూ అట్లా గుడ్లప్పగించి చూస్తున్నాను. చట్టున తెలివి తెచ్చుకుని రెండడుగులు వెనక్కి వేసి తిరిగి చూడకుండా వెళ్ళిపోతే సమస్య తెగిపోను. కాని మెదడు పనిచెయ్యదు. అడుగుముందుకూ వెనక్కూ పడదు.

ఒకొక్కప్పుడు హఠాత్తుగా ఏ అపూర్వ రాజాంతఃపురము లోనో వెళ్ళిపడ్డట్టు కల వస్తుంది. అద్భుతసౌందర్యంతో మెరిసి పడుతూ రాణి చెలికత్తెలతో విహరిస్తూ కనపడుతుంది. వెనక తళతళలాడే విచ్చుకత్తులపహారాలు, సిపాయిలు—రాజదండనం తలపునకు వచ్చి హడలిపోతాం. కళ్లు ఎదటి సౌందర్య ప్రవాహాన్ని ఆబగా తాగుతూఉంటాయి. చప్పున నాలుగడుగులు వెనక్కివేసి పారిపోతే ప్రమాదం తప్పిపోతుంది. కాని, అవయవాలు పనిచెయ్యవు. మనస్సుకూ ఇంద్రియాలకూ సహాయ నిరాకరణం. నాలుగు సెకన్లు గడిచిఉంటాయి.

గది గుమ్మం ముందు — మెట్లమీద గదిలోకివస్తూ కల కటాస్లిప్పర్ చప్పుడవుతోంది.

కొంప మునిగింది. ఆమె భర్తఎవరోవచ్చి భీముడు కీచుకుణ్ని గొంతునొక్కి చంపినట్టు చంపితే "ఎవరు నువ్వు-ఎందుకిట్లా వచ్చావు దొంగ దొంగ" అని కసికొద్దీ కేకలువేస్తే— చాలా ప్రమాదంలో పడ్డాను.

పక్క తెలివయినపిల్ల స్థితి చప్పున గ్రహించింది. చట్టున కుడిచేత్తో ఎడంచెయ్యి చూపుడువేలు పట్టుకుని "అయ్యో-ఈవేలు గొడ్డలితో... చీల్చినట్టు బాధపెడుతోందండీ. అన్నయ్యగారూ! మీకు మంత్రం ఒచ్చునేమో వెయ్యండీ. అయ్యో-బతికేబాధ కాదండి ఇది" అంటూ మంచంమీద కప్పగాకూచుని బాధపడుతోంది. పాపం జుట్టుచెదిరిపోయింది. కళ్ళు చెమ్మగిలాయి. అంత చక్కనిముఖం బాధతో అట్లా ముడతలు ముడతలుపడడం చూడలేకపోయాను" "అమ్మా భయంలేదు. ఒక్కనిమిషం మంత్రంవేస్తే సర్దుకుంటుంది. బాధ వచ్చినప్పుడే ఓర్చుకోవాలి" అక్కడ టేబిలుమీద ఉన్న జపాను సెల్యులాయిడ్ దువ్వెనతీసి వేలుమీద మంత్రించడం ప్రారంభించాను. ఇంతలో కలకటాస్లిప్పర్లధ్వని, ఒకపాతికేళ్ల యువకుడుగా మారి—ఆయన ఆత్రుతగా లోపలికి ఒచ్చాడు. ఆయన్నుచూచి ఆమెదుఃఖం మరింత హెచ్చింది. "ఇప్పుడే పరుపుతీసి పక్కవేస్తుంటే-ఎక్కడినుంచి ఒచ్చిందో మాయతేలు చంపేసిందండీ—సమయానికి మీరులేరు. అన్నయ్యగారు నా

ఏడుపువిని పక్క గదిలోంచి పరిగెత్తుకు వచ్చి మంత్రం వేస్తు న్నారు" వేలు వెనక్కి తీసికొని చేతుల్లో ముఖంపెట్టుకు కూచుంది ముఖకవళిక ఏమీ కనపడనివ్వకుండా. ఆయనదగ్గరగా వచ్చి "మరికొంచెం సేపు మంత్రం వేయించుకో రాదూ—బాగా నయంగా ఉంటుందేమో" అన్నాడు, పాపం. అతికష్టంమీద నవ్వాపుకుని నేనన్నాను. "ఇక అక్కరలేదండి. క్రమంగా అదే నయమవుతుంది. కాస్తమంత్రం పట్టివ్వాలి." ఆయన చాలా కృతజ్ఞత కనపరుస్తూ "శ్రమ ఇచ్చినందుకు క్షమించాలి. దైవంలా అడ్డుపడ్డారు—థాంక్స్" అన్నాడు మర్యాదగా.

నిజంగా నాకు దైవంలా అడ్డుపడ్డ ఆయనభార్యకూ మనస్సులో నమస్కారం చేశాను.

"అబ్బే దానికేమిటండి—బాధపడుతూవుంటే చూడగలనూ? పరిచయం లేకపోయినా చనవుతీసుకొన్నందుకు..." ఆయన అడ్డుకుని "చాల్లెండి—ఎంతమాట—" అనగానే ఆమె వైపు మళ్లా తిరిగి చూడకుండా ఆపత్తు దాటినట్టు ఆగది గుమ్మందాటి బైటపడ్డాను. తీరాతలుపు వేస్తూ చూస్తే—అది నా గదికాదు. ఆరో నెంబరుగది! పక్క 5 నంబరు గదిలో నాబస.

ఖర్మం—ఈ సత్రపుగదులన్నీ ఒకఅచ్చులో పోతపోసిన ట్టుంటాయి: ఆ అలమరలు, కిటికీలు, జల్లలు—అన్నీ ఒక్క తరహా—ఎంతపని జరిగింది! అనుకుంటూ నాగదిలోకి వెళ్ళి పడుకున్నాను.

అట్లా చరిత్రాత్మకమైంది ఈగది ! నాటికి నేడు ఈగదిలో, కాలుపెట్టాను. అని నవ్వుతూ గణేశంగారు కథపూర్తిచేశారు.

---

# యతిప్రాస మహాసభ

## క

తెల్లవారి చూసేసరికి సారంగధరుడి మెట్టమీద ఒక పెద్ద తాటాకుపందిరి. దాని పైని–కిందా–మామిడాకు తోరణాలు, రంగురంగుల జెండాలు, ఎరుపు, పచ్చ, నీలం కాగితాల గొలుసులూ, బుట్టలూ లేతగాలికి ఊగుతూ కన్నులపండువుగా కనిపిస్తున్నవి. ఆ పందిరికి చుట్టూ చినచిన్న కొత్త తాటాకు పాకలు అందంగా బారులు తీర్చి వీధులువీధులుగా ఉన్నాయి.

ఉదయం 8 గంట లయింది. బాలసూర్యుని బంగారు కాంతిలో జైలురోడ్డు మొదలుకొని మెట్టదాకా 'దయచేయుఁడు. దయచేయుఁడు' అన్న ఆహ్వానపు అట్టలకు అంతు లేదు. వీరభద్రపురంనుంచి వీరేశలింగంతోటకు ఏదో పనిమీద పోతూన్న నన్ను చూసి మిత్రులు సూర్యనారాయణశాస్త్రి గారూ సీతాపతిగారూ తొందరగా వెళుతూ "శాస్త్రీ, చప్పున రావాలి. గొప్ప తమాషా జరిగిపోతోంది. పరుగులమీద పోవాలిర" న్నన్నారు. 'ఊఁ. ఏదో రాగిశాసనమో, మరణ

శాసనమో దొరికింది కాబోలు' అని నవ్వుతూ "ఆగండి. ఏమి టాతొందర ? అన్నాను. రద్దూ ! వస్తేగాని చెప్పం ?" అన్నారు. 'పదండి' అని బయలు దేరాను.

ఛ

సీతాపతిగారు ముందు నడుస్తున్నారు. ఎట్టకేలకు మెట్ట సమీపించాం. పెద్ద తాటాకు పందిరి ఏదో సభా భవనంలాగా కనిపిస్తోంది. "కొంపదీసి ఆంధ్రసాహిత్య పరిషత్తు అభినవ కవులకు జడిసి ఇక్కడ జరగడంలేదుగదా" అన్నా సూర్య నారాయణశాస్త్రిగారితో. "అంతకన్న ఒక మహాసంస్థ ఒహ టిక్కడ లేవదీశారయ్యా మహానుభావా" అని తీర్చిన 'ఆర్చి' ఒకటి చూపించారు. దానిమీద "అఖిలాంధ్రయతి ప్రాస మహాజనసభ " అనే కాకిబంగారంఅక్షరాలు జిగజిగమన్నాయి ఒక్కసారి. సీతాపతిగారు మాతో రహస్యంగా "ఇక్కడ మన మెవరమో ఎవ్వరికీ తెలియగూడదు. తెలిస్తే వీళ్లు మనను దంపేస్తారు. జాగ్రత్త" అని హెచ్చరించారు.

ట

బారులుతీరిన తాటాకు పాకల మొదటిశ్రేణిలో వెళ్లినిలు చున్నాం. నిదానించి సీతాపతిగారు ఒకపాక దగ్గరకు నడిచారు మేము వెంబడించాం. ఆ పాకకు ఒకవైపున 'ఓరుగల్లు ప్రతి నిధులు' అని వ్రాయబడిన ఒక అట్ట వ్రేలాడుతున్నది. పాక

లెండు. మన వంశప్రతిష్ఠ కంతకును మూలవిరాడ్రూపిణి యగు నద్ధరాదేవి ఘనస్వాగతమునకై కదలిరండు." అని గంభీరంగా పలికేసరికి ప్రతినిధులందరూ సభాభవనం నింపేసోయి, 'ధరాదేవికీ— మహీరమణికీ— పుడమితల్లికీ—జై' అని తమ *కృతజ్ఞోత్సాహములు వెల్లడించి బారులుదీరి బయలుదేరారు.

స్వరయతులందరూ ఒకజట్టు. వ్యంజనవిరామము లందరూ ఒకగుంపు. బిందువిశ్రాంతుల చెట్టాపట్టాలు వెనుక. తరువాత విశేషవిరతుల శ్రేణి, అందరివెనకా అఖండయతిగా డా అప్ప కవిని తిట్టుకుంటూ భావకవుల్లో కలసిపోదామా అని ఆలోచిస్తూ బయలుదేరాడు. ఇనక వేస్తే రాలని యతిపటాలంతో రోడ్డు ఉక్కిరి బిక్కిరి అవుతూ ఒక మహాప్రబంధంలా ఉంది.

ఊరేగింపు వీరేశలింగంతోటదగ్గరకు వచ్చేసరికి చటుక్కున ఇంకొందరిని వెంటబెట్టుకుని 'క్రందుగ' గారు ప్రాసప్రముఖులను వెదుక్కుంటూ వచ్చి కలిశారు.

తిన్నగా ఉత్సవం లక్ష్మీవారపేట దగ్గరనుంచి 'సర్కారు పశువుల వైద్యశాల' మీదుగా గోదావరి స్టేషనువద్దకు నడిచింది.

మెయిలువచ్చి స్టేషనులో ఆగింది. అమరప్రకారం అక్షరాలా ధరాదేవికుండే పేర్ల జాబితా కంతటికీ జై జై కొడుతూ ఆహ్వాన సంఘంవారు ఆమె యెక్కిన పెట్టెకోసం జనాన్ని తోసుకుని పరుగెత్తుతూండగా, ఒకపెట్టెలోనుంచి తలంతా నెరిసి ఒకప్పుడు

తులలేని వైభవం అనుభవించిన ఒక ముసలావిడ తొంగి చూసింది.

'అరుగో వసుంధరాదేవిగారు' అంటూ జనం అంతా అటువెంపు పరిగెత్తారు. అవయవపటుత్వం తప్పినా సకలాంధ్ర కవిత్వరంగమూ అసివారుబయలుగా తిరిగిన ప్రాభవమూ, ఏఆంధ్రకవిఆపత్తులోనైనా అడ్డపడి కాపాడిన ఔదార్యమూ ముఖంలో ప్రతిఫలిస్తూండగా ధరాదేవి జరాభరంతో వణకుతూ దిగింది. ఆమె వెంట 'లీలా' కుమారి, 'లలి' కన్య స్వాగత పత్రాలూ, సంచీ పట్టుకుని దిగారు.

'మానుగ' జగన్మోహం' గార్లు గబగబ పరిగెత్తుకువచ్చి ధరాదేవిమెడలో కర్పూరపుదండలూ, పూల దండలూ వేసి సాష్టాంగంగా నమస్కరించి లేచారు. వచ్చిన ప్రతినిధులందరూ సాష్టాంగపడదా మనుకున్నారు గాని ప్లాట్‌ఫారం పట్టదనీ, పాసింజర్లు తొక్కి చంపేస్తారనీ భయపడి జంకి చేతులతోనే 'దండించి' తృప్తిపడ్డారు.

'సెకండ్ క్లాస్ కంపార్టుమెంట్' లోంచి నవనాగరికులగు ముగ్గురు యువకులు 'పోజు' లిస్తూదిగారు. జనంలో కొత్త ప్రతినిధులన్న గోల పుట్టింది. కార్యదర్శి 'మానుగ' గారు తెచ్చికోలునవ్వుతో తేరిచూసి 'అయ్యా, దయచేయండి! తమరు గుంటూరునుంచా, తెనాలినుంచా బయలుదేరారు' అన్నారు. 'అసలు మొన్నగుంటూరిలో బయలుదేరి తెనాలి

నిన్న రాత్రికి వచ్చి ఉదయం బెజవాడలో బయలుదేరాం'
అన్నాడు అందులో ఒకాయన. "తమ నామధేయం?"

"నాపేరు మధురం—ఈయన వలపుబరువు. ఆయన 'సుషమం.' ఏదో మీకుటుంబంలో వాళ్ళమే కనక బంధువుల నందరినీ చూసిపోదామని వచ్చాం."

"మంచిపనిచేశారు. దయచేయండి"

'మానుగ' వారిని వెంటబెట్టుకుని మహాజనంలోకి వెళ్ళాడు. లీలాకుమారి మధురాన్ని చూసి తన చురుకైన కళ్ళను ఓరగా అప్పళించి పరిచయసూచకంగా నవ్వింది.

'ప్రేమ గుడ్డిది' అనుకున్నాడు 'వలపుబరువు.' ధరాదేవి కారుఎక్కుటకు నిరాకరించగా రెండెడ్లబండిమీద ఆమెను ఎక్కించారు. 'లలి' కన్య ఆమెతో బండిలోనే కూచుంది. లీలాకుమారి, కొత్త ప్రతినిధులూ కారులో ఎక్కగా కారు బయలుదేరింది.

౭

మూడు గంటలకు మహాసభ ప్రారబ్ధమయింది.

స్త్రీల ప్రత్యేకస్థలంలో స్త్రీప్రతినిధులు కూర్చున్నారు. 'లీల' వారందరికీ నాయకురాలులాగ కొంచెంముందు కూచుని 'మధురం' మీద ఓకన్ను ఉంచింది. అంతట కార్యదర్శి 'మానుగ' లేచి కన్నులు మూసి, 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' అని దైవప్రార్థన చేయగా 'ఎవ్వనిచే జనించు' కూడా

చదివితీరాలి. చదవకపోతే లేచి వెళ్లి మేమింకోసభ పెట్టు కుంటా" మని ఓరుగల్లు ప్రతినిధులు తీవ్ర—గగ్గోల చేశారు. ఓమూలనుంచి రాజమండ్రి పెద్దమనిషి లేచి "అయితే 'శ్రీమద్భాగవతసహస్ర' ఒదిలిపెట్టవలసిందేనా ?" అని గద్దించాడు. మధురం జెండాలా లేచి ఫక్తు బంగాళీలో "గీతాంజలిలోవి పదిలైనులు చదివితేగాని మేం ఒప్పుకోం" అన్నాడు. చట్టున 'జగన్నాథం'గారు లేచి కాంగ్రెసువాదిభీకరారావంతో

"నాయకులారా! అమ్మలక్కలా—నాయనమ్మలారా! బ్రహ్మాండమైన కార్యక్రమము ముందుబెట్టుకొని దైవప్రార్థనకై తగవులాడుట వట్టి ఆంధ్రత్వము. ఆభారతామ్నాయగంగా భగీరథునియందు, ఆవాగనుశాసనునందు మీాకు గౌరవము లేదా! రెండియు నఖండ గౌతమీా జలకణహల్లోహాల మదబంభరమల్లధ్వనుల నుల్లములరు ఉద్దండమండలేశ్వర చండకాండాతికాండ నికురుంబకరంబిత రాజరాజ నరేంద్రచంద్రుడు పేరోలగము వంటి ఈ 'ధీరోలగము' న నింత పూచీలేని పేచీలు లేవనెత్తుట భావ్యమా ? సంభావ్యమా" అని గర్జించి అల్లరి సర్ది "ఏదేవియాధేయభావంబున స్థావరజంగమ ప్రపంచము కాలూని క్రాలు చున్నదో, ఏదయామయస్వాంత యనుగ్రహంబున నన్నయాదికవులు, వేమనాది యోగులు కృత్యాద్యవస్థ దాటి కృతకృత్యులైరో, ఏయుదారశీల గంటముదించి, ఆకుచించి ఆలోచన తెగక తన్నుకొనిచచ్చు ఆంధ్రకవుల కడ్డపడి ఆపత్తుబాటించెనో

అట్టి శ్రీ వసుంధరా దేవిగారు దయచేసి అధ్యక్షపీఠ మలంక రింతురుగాక." అని ఉరిమి కూర్చున్నారు.

"ముసలాళ్లు అధ్యక్షపీఠాలు వదులుకుంటేగాని ఈదేశం బాగుపడ" దన్నాడు మధురం. వెంటనే ఒణుకుతూ అధ్యక్ష పీఠానికి తడుముతున్న ధరాదేవి చేయిపట్టు 'లలి' కన్య పీఠం ఎక్కించింది. కార్యక్రమం ప్రకారం ఆహ్వానసంఘాధ్యక్షులు తమ ఉపన్యాసం ఇట్లా ప్రారంభించారు:

"అయ్యామ్మలారా! అఖిలాంధ్రయతిప్రాస మహాజనులారా! స్వాగతము. సుస్వాగతము. నేను ఇప్పుడు ఇక్కడ మనము ఎందుకు సమావిష్టులమైతిమో యందఱకుం తెలిసినయది కాదా? ఒకప్పుడు మనము తులలేని గౌరవమును, వెలలేని కానుకలను నింపుదళ్లుకొత్త సంపాదించినవారమెకామా! మన వంశము బహుపురాతనమని యిటీవల దొరికిన కరద్హాయవలన మరణశాసనముంబట్టి సువిదితమైనది కాదా? రాజరాజ నరేంద్రుని మొదలు రఘునాధరాయలవఱకు మనధాటి కెదు రొడ్డిన వారున్నారా?

నన్నయ మొదలు చిన్నయదాక మనల గాదని కాలుకదిపిన వారున్నారా? బాలకవి పార్ధసారథిశతకము దగ్గరనుండి మహాకవి భారతమువరకు మనము పెట్టినది భిక్షకాదా! (పొంగివచ్చే కన్నీళ్లు తుడుచుకొని) చచ్చి స్వర్గముననున్న నన్నయతాతగారు వనియున్నను లేకున్నను నన్ను బిలిచి యభిమానపుత్రునిగా జూచిన దినములు తలచుకొన్న నాకు

దుఃఖము వచ్చుచున్నయది. కన్నీరు మున్నీరగుచున్నది. 'క్రందుగ బాష్పరోధమున కంఠమునన్' జెడుచున్నది. అయినను గొన్ని సంగతులు మనవిజేసి విరమింతును.

"నేడు కొందరు మన మహాకవు లిచ్చిన ప్రబంధరాజముల జదివి బాగుపడిపోయి, ఎదురుతిరిగి, పొల్లుపదములు, పడికట్టు రాళ్లు అని మన 'భవిష్యము' తీయుచున్నారు. చెల్లరే యిది యెంత విశ్వాసఘాతుకత్వము! అన్నమ్మకచెల్ల వీరి నమ్మగజెల్లదు. వంకాయలబజ్జీవలె వట్టి గీతపద్య మిప్పటివారి కారాధ్యమైనది. ఇందు యతి సోదరులకు భిక్ష దొరకినను ప్రాస ప్రముఖుల ప్రాణములు పోవుచున్నవి. ఉభయులను గౌరవించు తెలివి వీరికి లేదా? నేటి కాలపు డిప్రెషన్ పద్యములకుగూడ ప్రాకినదా! (భీకరంగా) ఆశార్దూలము లేమి! (గర్వంగా) అమత్తేభము లేమి! (మృదువుగా) ఆ చంపకమాలలేమి? (సువాసనగా) ఆ ఉత్పలమాలలేమి! వాని 'ఫసందు' ఈతుక్కు గీతములకు, నీ చొప్పగేయములకు వచ్చునా? మెచ్చుదెచ్చునా? ఇన్నీ యివి లెన్నయే? (సభలో: ఆహా ఏం కొట్టేస్తున్నాడయ్యా దెబ్బలు. బలే! అనే అభినందనాలు) ఏమయినను పోయినది - పోయినది. ఆంధ్రకవిత్వప్రతిష్ఠ అడుగంటినది. పాపము గోపాలకృష్ణయ్య ఏమన్నాడు? "కోతిమూకకవిగాళ్ల గతు లయోమయము లై నన్ను వీధిని బెట్టనెన్నుచుండ" అని ఆంధ్రమాత ఆవేదనగా వినిపింపలేదా? లేవరేమి? నడుములు బిగింపరేమి? కాళ్లెగుర వేయరేమి? అల్పులము మన మేమి చేయగలమని యోడకుడు.

చెప్పలేదా చిన్నయసూరి మహాకవి 'గడ్డివెంటి గంధగజమును బంధించు' నని, కావున మనమందరము మన నవమానించిన క్రొత్తకవులను కెక్కు కెక్కుమనిపించుట కొక క్రొంగ్రొత్త మార్గము కనిపట్టి ప్రచారముచేయ నీమహాసభాసన్నాహము జేసితిని. అది యెట్టిదన :— క్రొత్తకవుల యూహాలు విదేశీయములైనను భాష స్వదేశీయ కావలయును. కనుక వారు భాష కొఱకు ప్రబంధగ్రంథములు జనుపునప్పుడు మనము మూతివిరిగించి బిరబిగిసితిమేని యతడు ఎంత తన్నుకొనినను మన యాంతర్యమును దెలిసికొనలేక చివరకు మనకు దాసోహమయి చెప్పినట్లు వినును. ఈ ఘనకార్యమునకు మీరందరేకీ మత్యులై తోడ్పడినచో క్రొత్తకవులను ఘడియలో లొంగదీయగలను.

"నేను చిరకాల మాయఖండగౌతమి నఘమర్షణస్నాన మాచరించి, సారంగధరపర్వతమున ఘనతపం బాచరించి ఈ సహాయనిరాకరణోద్యమమును గనిపట్టినాను. గాంధీ నాప్రియశిష్యుడు. చెప్పమరచినాను.

"వజ్ఝలపండితాదులు వసుచరిత్ర విమర్శనాదికములో మనము వ్యర్థులమని దూషించినను నలుగురిలోను మనము లేకున్న రసభంగ మగునని చెప్పుచుండుటచే వారి నెంతయు మన మభినందింపవలసియున్నది. ఇక మనమనిన నోర్వలేని ముగ్గురను తీవ్రముగ నభిశంసింప వలసియున్నది. సోదరులారా! చాలతడవైనది. నేను సూచించిన ఉత్కృష్టపద్ధతి ననుసరించి వంశప్రతిష్ఠ నిలువంబెట్టుడు.

అని జగన్నాతంగారు సుఖాసీనులు కాగా ఉద్వేత్తుగా రేగిన తప్పెటలవంటి చప్పట్లమధ్య ధరాదేవి లేచి "చిరంజీవులారా! ఎందరో మహానుభావు లుండగా నన్ను, ఈ ముసలిముత్తైదువను అగ్రాసన మెక్కించుట కేవలము తమకున్న స్త్రీగౌరవమె యని చెప్పకతప్పదు. ఇంత మహోన్నతిపదవికి నేను తగను. శ్రీనాథాదికవిరాజులు నామీద నిష్కారణ గౌరవము చూపి నన్నే మీరును వ్యర్థగాలనగు నామీద నింతయాదరము, ప్రాముఖ్యమునుంచి మీసాభిమానము ప్రదర్శించినందుకు చాల కృతజ్ఞరాలను.

"నా జీవము, జవము నేనాడో తెనుగుకవులకే ధారపోసిన నేను ఈజరాభరమున నేమియు మాటలాడలేను. అది యటుండగాక శ్రీజగన్నాతంగారే చెప్పవలసినదంతయుం జెప్పి నాభారము తగ్గించినారు. వారి యమూల్యోపదేశముల ననుసరించి మీరందరు కృతకృత్యులగుదురు గాక యని కోరుచున్నాను" అని చదికిలబడగా చివ్వున అఖండయతి లేచి "జ్ఞాతిశ్చేదనలేన కిమ్మనెడి వాచా సత్యంబుగా మీరు నన్ను దరిజేరనీక తరిమికొట్టినారు. నామీద ఆదరంచూపిన కొత్త కవుల వ్యావహారిక భాషతోనే మాట్లాడుతాను.

భారతకవులు నన్నభిమానించినా అప్పకవి వాడి సొమ్మంతా పడిపోయినట్టు నన్ను కాదని అడ్డమైన గడ్డి కరచాడు. నా సోదరుడు రలయతికి విషమే పెట్టాడు. నన్ను ఆదరించిన అభినవకవులను నమ్ముకుని మేమిద్దరం వారితోటే ఉంటాం.

మేము మీలో ఎప్పటికీ కలియం. నాకు మీసంస్థలో సంబంధం లేదు." అని దబాయించి చెప్పి కూర్చున్నాడు. యతిప్రముఖులు మండిపడి "ఏల చొరంగనిచ్చితిరి యిత్తురకన్ మన సీమలోనికిన్" అన్నట్టు ఉగ్రులై చూశారు. కొత్తప్రతినిధులలో 'మధురం' లేచి 'జగన్నాథంగారి అభిప్రాయాలతో కొంతవరకూ ఏకీభవిస్తాం. అక్కట్టే చెప్పవలసింది లేదు' అని కూర్చున్నాడు. కార్యదర్శి లేచి 'మహానుభావులారా సహృదయ సోదరులారా! తమరందరు సాదరభావముతో సందడించి ఇచ్చి సభ జయప్రదముగా జరిపించినందులకు ఇదే వేనవేలు కృతజ్ఞతావందనములర్పించుచున్నాను. ఈ తీర్మానములను తామందరు చిత్తగించి సమ్మతింప గోరుచున్నాను.

౧. ప్రస్తుతము, మన సంఘమును బహిష్కరించి క్రొత్త త్రోవలను త్రొక్కుచున్న ఇప్పటి కవులు ప్రబంధములఁ బట్టుకొనినచో వారి కడుగడ్డున సద్దుతగిలి యేడిపించుటకు నీ సభ వారు తీర్మానించుచున్నారు.

౨. తమ విమర్శనలలో మనము వ్యర్థులమని దూషించి వ్రాసినను, సలుగురిలోను మనవల్ల రస ముప్పతిల్లునని చెప్పు వర్షులపండితాదుల నీసభ వారు అభినందించుచున్నారు.

౩. మనలను పీఠికలలోను, పత్రికలలోను దూషించి యూహాపరములకు జెడిన ఛందోదర్పణపీఠికాకారుడు సీతాపతి, యతిప్రాసలైచ్ఛికములని యుగాదిసంచికలో వ్రాసిన సూర్యనారాయణశాస్త్రి, పద్యములలో యతిప్రాసలుత్రోసి మనపై

కత్తికట్టిన హనుమచ్ఛాస్త్రి గార్లను ఈ సభవారు మిక్కిలి గర్హించుచున్నారు.

సభ్యులంతా 'భేష్' అని చప్పట్లుకొట్టి, అట్టహాసాలు చేసి తమ ఆమోదమును తెలియజేస్తూ సభలోంచి లేచారు. మేమెవరమో తెలియకుండా బయటపడేటప్పటికి [illegible]మయింది.

---

## వన దేవతలు

చార్వాకమహర్షి ఆశ్రమం. చతురస్రంగా [illegible]. చుట్టూ మహాయోధులవలె పెద్దపెద్ద టేకిచెట్లూ [illegible] మధ్య జీలుగుచెట్లూ నాలుగుపక్కలా నాలుగువెదురు పొదలూ దట్టంగా కప్పుకొని ఉన్నాయి.

ఒకపక్కను, ఎత్తైనప్రదేశంమీద పెద్దమర్రిచెట్టూ, దాని కింద పూరి, రెల్లు, తాటి, చిక్కగానేసిన చిన్న ఇల్లూఉన్నాయి.

పొదనీడను ఒకజింకపిల్లను తొడమీదపెట్టుకుని చిగుళ్లు మేపుతూఉన్న ఆ అమ్మాయిపేరు కురంగి. ఆమెకు జింకపిల్లలంటే మహా—యిష్టం. కనుకనే తండ్రిగారు ఆఅమ్మాయిని కురంగి అన్నారు. ఆమెకళ్లనిండా పెంకెతనమూ—ముఖం నిండా లావణ్యమూ పరుగులువారుతూ ఉంటాయి.

దానికికొంచెం ఎడంగా వాలఖిల్యమహాముని ఆశ్రమం. దానిచుట్టూ మొగలిడొంకలు చిక్కగాపూసి మెరుస్తున్నాయి.

వాలఖిల్య మహాముని పౌత్రుడు శ్రీశుకుడు తండ్రి జంబాల ఋషి మహాదేవార్చనకు, అక్కడకు అరక్రోసుమారంలో ఉన్న రుమణ్వతీనదిలోని ఉత్పలములూ, కమలములూ పక్క అడవి లోని శ్రీబిల్వదళములూ రోజూ పట్టుకొని వెళ్లుతూంటాడు. అయితే అతని మామూలుబాటన నల్లమలమళుపులోంచి ఇప్ప చెట్లలోనమీదుగా చేరువగా ఉండేది. కాని ఈవేళ చాలా చీకటిఉండగా లేవడంచేత ఇప్పతోవలోని కొండచిలువలకు భయపడి దూరమైనా బాహాటంగా వెళ్లవచ్చునని చార్వా కాశ్రమంమీదుగా వచ్చాడు.

కురంగికి శ్రీశుకుడితో పరిచయంలేదు గాని—సాయంకాలం రుమణ్వతిలో తనపెంపుడు లేడిపిల్లలకు నీళ్లుతాగించడానికి, ఆ నదిఒడ్డునున్న దరిసెనపూవులు వాటికిమేపడానికి వెళ్లినప్పుడు నీటికిదగ్గరగా సాయంసంధ్య నుపాసించే శ్రీశుకుణ్ణి చూడడం కద్దు. సాయంకాలపు బంగారుఎండలో సంపంగిపువ్వులా మెరిసే అతనిముఖం చూడడం ఆ అమ్మాయికి ముచ్చటగా ఉండేది.

అతను తనచేరువకురాగానే చటుక్కునలేచి నిలుచుంది. లేడిపిల్ల పల్లవకబళంనెమరువేసుకుంటూ పక్కకు జరిగింది.

కురంగికి శుకుణ్ణి పలకరించా లనిపించింది. కాని—ఇంత వరకూ పరిచయంలేని ఏఋషికుమారుడితోనూ మాటాడి ఎరగదు. ఎంతసేపూ లేడిపిల్లలతోటేగా వ్యావృత్తి. నల్లనికొంటెకళ్లు ఓరగాఎత్తి, పగడపుతీగమీద తొణికిపడే ముత్యాలకుమల్లె ఎర్రనిపెదవిమీద సన్నంగా నవ్వుతూ " మీ

ఆశ్రమానికి ఇదికాదుగా త్రోవ" అంది తోవకు అడ్డంకాని అడ్డంగా నిలిచి.

శ్రీశుకుడు ఈవేళ ఇక్కడ ఈమె మాటలాడుతుందని తోస్తే ఈత్రోవంటే రాకపోను. అంతభయం ఆడపిల్లలతో మాటలాడడమంటే అతనికి. తక్కిన ఆశ్రమాలలో మునికన్యకలూ, మునికుమారులూ ఎంతోకలిసిమెలిసి ఉంటారు ఆడుకుంటూ పాడుకుంటూ—

తలవంచుకుని చేతిలోఉన్న కలువపువ్వు కదుపుతూ, బిల్వదళం మెలిపెడుతూ "ఏమో...ఇక్కడ ఆడపిల్లలుంటారని గాని, రాకూడదనిగాని ఎరక్క దగ్గరత్రోవ అని వచ్చాను. పోనీ రేపట్నుంచిరాను" అన్నాడు.

"ఈవేళ వచ్చినందుకు" అంది మరీధైర్యంగా. లోకువ చిక్కితే అధికారం చలాయించడానికి ఆడపిల్లతరవాత.

"మళ్లా వెనక్కితిరిగిపోనా?" అన్నాడు పాపం. "ఎందుకూ—రెండునీలోత్పలములూ, నాలుగు శ్రీబిల్వపల్లవాలూ ఇస్తేచాలు—ఈ త్రోవంట వెళ్లిపోవచ్చు" అంది పెంకెనవ్వు పెదవుల్లో అణుచుకుంటూ.

"ఇవి లేడిపిల్లలకిస్తే మహాపాపం. తలలో పెట్టుకోడానికి కావివి. శ్రీమహాదేవపూజా కైంకర్యానికి. కావలిస్తే మా మొగలీపువ్వులు ఇష్టమొచ్చినన్ని తెచ్చుకోవచ్చును. సాయంకాలం రుమణ్వతి ఒడ్డుకి తెమ్మంటే తెస్తాను. వేళకు వెళ్ళకపోతే తాతపాదులు కోప్పడతారు. అన్నాడు సవినయంగా శ్రీశుకుడు.

"ఆ మొగలిపువ్వులే మీ దేవుడికి పూజచేసి ఇందులోవి నా కెందుకివ్వకూడదూ"

"మహాదేవుడికి మొగలిపువ్వులు పనికిరావు. ఆయన వాటిని శపించారు."

"ఏమో — వెర్రినమ్మకాల్లూ శాస్త్రాలూ మీరూ — అంతచక్కని పూలకు శాపం ఏమిటి? ఆ దేవుడు పాపంగాని వాటిని అనుభవించలేక. సరే అంతపరిమళించే పువ్వులు శిలల మీద కుళ్ళిపోకుండా కేవలం మాతల్లో మెరిసే యోగం ఉంది వాటికి. మొగలిపువ్వులంటే చాలాయిష్టంనాకు. సాయంత్రం...తప్పకుండా రుమణ్వతి ఒడ్డుకి తెచ్చిపెట్టాలి మరి"

"ఎంతమాట! నా౽నృతంవదేత్"

పకపక నవ్వుతూ కురంగి "ఎక్కడికీ వేదానికి. దీని రెండో పక్కనే అసత్యం ఆడితే తప్పులేదని ఉంటుంది." అంది తండ్రిగారి వేదనిరాకరణ సారమంతా గ్రహించినట్లు.

* * *

అతడు శ్రీవత్సమహర్షి దౌహిత్రుడు. పేరు శ్యామశర్మ. కొంచెం చామనచాయగా ఉంటాడు గనక తాతయ్యగారు నవ్వుతూ అతనికి పెట్టిన పేరది.

భారద్వాజుడు, శ్రీశుకుడూ అతన్ని మరీ ఎగతాళి పట్టించడానికి సుశ్యామ అంటారు.

శ్యామశర్మ నాలుగ్ఘడియల పొద్దుండగానే కుశలు సమిధలు తేవడానికి రుమణ్వతీతీరానికి వెళ్లాడు. గబగబా ఇన్ని

సమిధలూ, దర్భలూ పోగుచేసి అంగవస్త్రంలో కట్టకట్టి నది దగ్గరకుదిగాడు. ఒక రాతిమీద ఇన్నినీళ్లు చిలకరించి అంగవస్త్రపు మూట అక్కడపెట్టి సంధ్యావందనం చేసుకుంటున్నాడు.

కొంచెందూరంలో శ్రీశుకుడు ఒక మొంగలిపొత్తి చేతిలో పట్టుకుని ఎవరికోసమో ఎదురుచూస్తున్నాడు.

నదిపక్క రెల్లుపొదలలోంచి ఒక పదహారేళ్ల అమ్మాయి వస్తున్నది. పచ్చని చరను సూర్యకిరణాలు పడి ఇంగువనూనెతో దువ్వుకొన్న ఆమె తలవెంట్రుకలూ రుమణ్యాతి కెరటాలూ ఒక్కలా మెరుస్తున్నాయి. శ్యామలకాంతితో తళతళలాడుతూ సోగగా ద్రాక్షతీగలాఉంది ఆమె శరీరం. ముఖంలో ప్రతి అణువూ నవ్వుతూన్నట్టుంది. ఒకపక్కని ఇర్రి—ఒకపక్కని లేడి—ఆమెచేతిలోని రెల్లుపువ్వులనూ దిరిశనపువ్వులనూ మేస్తూవస్తున్నాయి. ఆ అమ్మాయి శ్రీశుకుణ్ణిచూచి ఒక్క అడుగులో అతనిదగ్గరవాలింది లేడిపిల్లలు వెనకపడ్డాయి.

కురంగి దగ్గరకురాగానే శుకుడు "ఇవిగో......పువ్వులు" అన్నాడు. ఆత్రుతగా చనవుతీసుకొని చేతిలోనుంచి ఊడ లాక్కుంది కురంగి.

పై రేకులు దూరంగా పారవేసి వాటికిందవి ఇర్రి కందించి గర్భదళాలురెండు జుట్టులోపెట్టుకుని "ఇప్పుడెలా ఉంది నాజుట్టు" అంది ఒకఒయ్యారంతో తలఎత్తుతూ. "సాల గ్రామాలమీద పూజచేసినట్టుంది" అన్నాడు అమాయికంగా.

"ఛీ—రాళ్లమీద పార వేసినట్టుంటే—ఈపూవులు నా కక్ఖర్లేదు" లేనికోపంతో ఎత్తనిచేతితో తీసివేయబోయింది.

"వద్దు వద్దు..... నేనుచెప్పలేనుగాని చాలా బాగు న్నాయి" బతిమాలి నట్టన్నాడు.

శ్యామశర్మకు సంధ్యావందనం తొణగడంలేదు వారిని చూస్తుంటే. ఎట్లాగోపూర్తిచేసి దర్భల కట్టపట్టుకుని వారి దగ్గరకువచ్చాడు.

శుకుడు, "మరి—సిజుట్టులో పువ్వులు ఎలా ఉన్నాయో నువ్వేచెప్పు" అన్నాడు. శ్యామశర్మ అందుకుని "నేచెప్పనా. చంద్రకాంతులు పడి కలకలలాడే రుమణ్యాతి లావుంది" ఏం అన్నాడు. అదిగదీఅన్నట్టు అభివందనపూర్వకంగా అతని వేపు చూసింది.

విశేష పరిచయంలేకపోయినా కురంగి 'శ్యామ'ను ఎరుగును. అతడు ఎప్పుడైనా చార్వాకమహర్షి వద్దకువెళ్లి ఆయన తాలూకు ప్రచండమైనలోకాయతిక వాదం వింతగావినడముంది.

"సుశ్యామా, ముఖ్యకాలం దాటిపోతోంది. అపచారం. నేసింకా సంధ్యవార్చలేదు. నేనువచ్చేదాకా ఇక్కడ ఉంటారు గదూ—క్షణంలోవస్తాను" అని నీటిదగ్గరకు వెళ్ళాడు.

కురంగి అంది "శ్యామా, చాలారోజులైంది. ఒక్కసారి ఉపస్సూక్తాలు పాడవూ—రా ఇసకలో కూర్చుందాం. వెన్నెలఎంతో బాగుందిగదూ "కురంగీ, ఇప్పుడుసూక్తాలేమిటి పోనిద్దూ ఈవెన్నెల్లో—ఇసకలో ఆడుకుందాం రా—రేవు

మీ ఆశ్రమానికి వచ్చిచనావుతాను" అన్నాడు గొంతు సవరించుకుంటూనే.

"కాదు......ఇప్పుడే......తప్పించుకోడానికి......ఈ నూటలు......నాకు తెలుసులే......అంది,

శ్యామశర్మ పరవశంగా మొదటిసూక్తం పాడుతున్నాడు. చల్లని వెన్నెల్లో—ఆప్రశాంతసమయంలో ఆదిఋషులు పలికిన క్రమ కవితాగానం ఋషికుమారుని స్వచ్ఛమైన ఉదాత్తాను దాత్త స్వరితపరిష్కృతమైన మనోహరవాక్కు మీదుగా అమృతం కురుస్తోంది.

హఠాత్తుగా కురంగి "శ్యామా చూడుచూడు—ఆసారసం నదిలో ఈదుతూ ఈ ఒడ్డుకుదగ్గరగాఉన్న తామర తంపరలో చిక్కుకుపి ఎలాగింజుకుంటోందో పాపం" అంది జాలిపడుతూ ఆత్రంగా—చటుక్కున సూక్తంఆపి శర్మపరుగెత్తుకు వెళ్లి సారసాన్ని చిక్కుల్లోంచి విడిపించి తెచ్చాడు.

సారసం అతన్ని కరుస్తూ అరుస్తూ శర్మనందిలపడుంది. "అమ్మమ్మా! వదలిపెట్టు పాపం." అంది కరుణతో చలించే కళ్లతో కురంగి.

"భయంలేదు. ఈతామరతూడు పెడితే......తింటూ ఆడుకుంటుంది మనదగ్గర" తెచ్చినతూడు ఒకటి చంచువుకు అందించాడు. సారసం తూడు అందుకుని శర్మఒడిదిగి ఇసకలో నడుస్తోంది. ఆమెలేడి ఇసకలోఎగిరి ఆడుకుంటోంది. ఇద్దరి మాత్రం ఆమెతొడమీద తలపెట్టి చంద్రుణ్ణిచూస్తోంది.

శ్యామ సూక్తశేషం అందుకున్నాడు. కురంగి పరవశంగా వింటోంది. సారసం మెల్లగా వెళ్లి ఆమెవల్కలమును చంచూపుటంతో గట్టిగా పట్టుగుంది. ఆమె అదిరిపడి విదుర్చుకోబోతే వదలలేదు. శర్మచప్పున ఆమెచక్కగా జరిగి అదలించగా అరుస్తూ నదివైపు ఎగిరిపోయింది.

ఈ తొట్రుబాటుతో కురంగి శర్మచేతుల్లో చిక్కింది. అతని చేతిమీద—భయంతో—తనతలవాల్చి "అబ్బ! ఏం సారసం—వదిలించమంటే తెచ్చి ఒళ్లోపెట్టి కూచున్నావు—నాయ—చంపేసింది" అందినవ్వుతూ సిగ్గుగా.

ఆమె తలలోని మొగలిపూల తీవ్రపరిమళం శ్యామశర్మ తేనూ మనస్సునూ గిరున తిప్పింది. శిలకు శ్రీరామున్పర్శతో చైతన్యం వచ్చి జగన్మోహిని పుట్టినట్టు అంతవరకెప్పుడూ స్త్రీస్పర్శ ఎరగని శర్మ కఠోరబ్రహ్మచర్యా జడప్రకృతిని చీల్చుకొని ఒక అపూర్వమధురానుభూతి పైకుబికింది. ఆమె తాకినంతమట్టుకు అతని శరీరంలోని నెత్తురు కితకితలుపెట్టి కిలకిల నవ్వింది.

శ్రీశుకుడువచ్చాడు. నద్దుకుని కూచున్నారు. "ఇంక ఆశ్రమానికి వెడదామా" అంటూనే కూర్చున్నాడు శుకుడు.

ఏమిటంత తొందర—మనం ఎక్కడఉంటే అదే ఆశ్రమం. వెళ్లలేకపోతామా" అందిహేలగా. "తాతపాదులు కోపపడతారు. తొందరగా వెళ్లాలి." లేవబోయాడు శుకుడు.

"పోనీ......నా సంగతులూను అంటోనుర్లక్ష్యమేనే ఈ

పువ్వులు నాకక్కర్లేదు" చేతులోపువ్వులు విసిరి కొట్టింది కోపంనటిస్తూ.

"అబ్బా—ఏమిటీ కోపాలు. ముళ్లుచీరుకొని కోసిన పువ్వులు—ఇట్లాగేనా విసరడం . ...ఇంకేం మంచి గర్భ దలాలు తలలోనే ఉన్నాయి. ఆడపిల్లలు మహాగడుసువారు" కహ కహ నవ్వాడు. ఆపిల్లవిసిరిన ఆపూవులు మెరుపుల్లా తగిలాయి. అతనిలో ఏదో ఉత్సాహ ఝరిపుట్టుకువచ్చి అతన్ని తీవ్రంగా చలింపజేసింది.

కొండగోగు పువ్వులా ముఖంపెట్టి "ఏంపని ఇది?" అని నవ్వుతూ ఆమెచేతులు పట్టుకున్నాడు. పక పక నవ్వుతూ వెన్నలా కరిగిపోయింది. కురంగి.

*   *   *

రమణ్యాతిలో ఒకప్రక్కను కమండలం ముంచిన చప్పుడు. చేయి ఎత్తుమనిషి. ఒక కాషాయాంబరం కప్పుకొన్నారు. బుజంమీద పొడుగ్గా ఎదిగిన జడలు పడుతున్నాయి. పొడుగైన గడ్డం. రెండూ తిలతండుల న్యాయంగా ఉన్నాయి. బ్రహ్మతేజస్సు ముఖంలో ఉట్టిపడుతూండగా శ్రీశుకాదులు ఉన్నచోటికి వచ్చారు.

'అమ్మయ్యో—తాతపాదులు" అన్నాడు శుకుడు. అంతా సంభ్రమంగా—వినమ్ర శీర్షాలతో నించున్నారు. జంబాల మహర్షులవారు సమీపానికి రాగానే ముగ్గురూ

"నమః పరమర్షయే తాతపాదాయ" అని పాదములు స్పృశించి నించున్నారు.

"దీర్ఘాయుష్యమస్తు—నాయనా, ఇంతచీకటి పడేవరకూ ఇక్కడే ఉన్నారేమీ—మార్గాలు సరిగా ఉండవు. గర్తపాషాణాదులు భ్రమ ప్రమాదాస్పదాలుగా ఉంటాయి... లేవండి వెళ్లుదాం...ఇదిగో కురంగి! అమ్మా నీలేడిపిల్ల లేదీ?" అంటూ ఆ అమ్మాయిని దగ్గరగా తీసుకున్నారు. ఆమె తలవంచుకొని "నాకు ఉపసూక్తాలు నేర్చుకోవాలని ఉంది. చెబుతారా పితృపాదులు?" అంది ముద్దుగా.

అమ్మా అభ్యంతరమేమి? రేపటినుంచి తీరుబడిగా ఉన్నప్పుడల్లా ఆశ్రమానికి వస్తూండు. శ్యామ, భరద్వాజ, చిరంజీవి, అంతా ఉంటారు. శ్యామశర్మ కంఠం వీణలా ఉంటుంది. అతడు చెబుతాడు—...ఇంక వెళ్లవలె. రండి" అని ముందు ఆయన నడుస్తున్నారు. వెనక శుకుడు తర్వాత కురంగి పిమ్మట శ్యామశర్మ ఆయన్ను అనుసరించారు.

"భవిష్యద్గురుదేవులు శ్యామశర్మగారికి నమస్కారాలు" అని వెనక్కితిరిగి సన్నంగా అని శర్మ ఉత్తరీయ వల్కలం లాగింది కొంటెపిల్ల.

---

# ఆకలి మంటలు

మధ్యాహ్నం మూడుగంటలికి మొదలెట్టింది మాయవాన. తెరపిలేకుండా దీపాలవేళదాకా కొట్టి అక్కడినుంచి ముసల

వాడి నసుగులా ముసురులోకి మారింది. చెడతాగిన భాగ్యవంతుల్లా చెట్లు జోగిజోగి ఊగుతున్నాయి. ఆకాశానికి ఆకలి గావును. ఉరుముల్లో ఏడుస్తోంది. ఊరుకోమని గాబోలు— బంగారపు కొరడాల్తో ఎవరో కొడుతున్నారు. కొట్టినకొద్దీ ఏడుపు ఎక్కువవుతోంది.

ఈవర్షారాత్రి ఎంత బాగుంది. తలంటుకొన్న ఆడపిల్లలా ప్రతికొమ్మా, ప్రతీతీగా స్వచ్ఛంగా మెరుస్తోంది. ఎఱ్ఱనిరోడ్ల నీళ్లు మురుగుకాలవల్లో గలగల పారుతున్నాయి.

వర్షం కురుస్తూంటే ఎన్ని వెచ్చనికోరికలు! నులి వెచ్చని భోజనం—మంచి పట్టెమంచాలమీద కాశ్మీర శాలువల ముసుగుల్లో—ఎత్తైన మేడలమీద—సంసారానికీ సరసానికి వెచ్చతనం వచ్చేకోరికలు—

భగవంతుని గారాబుబిడ్డలు అనుభవించడానికి పుట్టారు. పురుగులు ఏడిస్తే వారికి నవ్వు. ఆమహాపట్టణంకూడా ఈ వర్షారాత్రి సుఖం అనుభవిస్తున్నట్టు కదలకుండా ముడుచుకు పడుకుంది. పెంకుటిళ్లూ మేడలూకూడా ఒకదానినొకటి పలకరించలేక బద్ధకంగా ఊరుకున్నాయి.

వీధిలోపడ్డ ఎంగిలివిస్తరాకు మెతుకులకోసం కరుచుకు దెబ్బలాడే కుక్కలజంటయొక్క అనాగరికతాస్థితికి అసహ్యించుకొని వీధిలోకివచ్చిన కాలేజీవిద్యార్థి ఒకడు కంకరరాయితో వాటిని సర్దుబాటుచేసి వెళ్లాడు.

౨

ఒక వీధి కొనలో 'సందేకవళం నాయనా' అనే దౌర్భాగ్యపు కేక బయలుదేరి వస్తోంది. గుడ్డివెన్నెలలో ఆమె స్వరూపం బాగా కనపడడం లేదు. వర్షంలో ఆమె గుడ్డపేలికలు తడిసి ఎక్కడి వక్కడ అంటుకుపోయాయి. జుట్టుకొనలనుంచి నీరు కారుతోంది. అప్పుడప్పుడు మెరిసే మెరపు వెలుగులో ఆశతో భగ్గున వెలిగే ఆమెకళ్లూ—చేతిలో అల్యూమినియం చిప్పా తప్ప ఇంకేమీ కనపడడం లేదు.

ఒక వీధి అంతా నిశ్శబ్దంగా నడిచి వచ్చింది. అన్ని ఇళ్లూ గాఢనిద్రలో ఉన్నాయి. దేన్ని పలకరించినా కదిలి కొడు తుందని భయమేమో—

రెండోవీధి— మూడోవీధి— తిరిగిపోయాయి. ఏ తలుపు లోంచి దీపకళిక తొంగిచూచినా కొంతఆశ—ఆవేళ దీపాలు కూడా నిద్రపోతున్నాయి.

నాలుగో వీధి కూడా వచ్చింది. అన్నీ మేడలు. మేడలంటే దరిద్రులికి ఎందుకో ఆశ. వాటిలో కావలసినంత డబ్బు— దర్జా—తిండి—బట్టలు నిండి ఉంటాయి. బిచ్చగాళ్లని రమ్మని పిలుస్తాయి. తమకోసం, లేనివాళ్లుపడే తహతహచూసి తృప్తిపడి, అప్పుడు వాళ్లని రెట్టింపు ఈసడింపుతో మెడపట్టుకు గెంటు తాయి. అయినా బుద్ధిలేదు.

ఇదీ వరస—

ఒక మేడ, పై అంతస్తులో, కొంచెం అలికిడిగా ఉంది. కింది తలుపులు పెదవికదపవు. లోపలినుంచి అంతరాత్మ "అడుగు—నోరుమూసుకు నడిస్తే పీటవేసి పిలుస్తారా? ఎవరైనా—" మనస్సు "ఊరికే అరవమన్నావా? ఎవరూ కనపడరు"

ఆత్మ "ఇక ఈ వీధిగూడా అయితే నీపని మాడడమే—ఉదయంనుంచీ తిండిలేదు—పెడితే పెడతారు లేకపోతే లేదు ఇక్కడ గట్టిగా అరువు—"

విధిలేక మేడమెట్లెక్కింది. "మాదాకవళం..." "ఛాప్—ముందు మెట్లుదిగు. అక్కణ్ణించి అడుగు—ఆమురికినీళ్లన్నీ గుమ్మంలో చూస్తే అయ్యగారు మమ్మల్ని తిడతారు" మెట్లు దిగింది. గట్టిగా "పొద్దుట్నించి కూడులేదు. కాస్తపెట్టించండి బాబయ్యా" కడుపుమంటకొద్దీ తారక స్థాయిలో అడిగింది.

మేడమీది వెచ్చని ముసుగు సుఖానికి తగిలింది. కదిలింది. పై కిటికీలోంచి "ఈవెధవ ముష్టివాళ్లకి వేళాపాళాలేదు. పొద్దున్న తగులడగూడదూ—" స్వగతం.

ప్రకాశంగా "ఎవర్రా కింద—గాడిదా—జవాబు చెప్ప లేవూ?" దయ ఉట్టిపడుతోంది. నౌఖరు ఖంగారుగావచ్చి "పోపో—పొద్దుటరా—బుద్ధిలేదూ—వేళగానివేళ—అంఘర్షీ లేవుగుంటూ—"

వెళ్లిపోయింది.

ఇంకో మేడ. గుమ్మం ఓరగా తీసిఉంది. మాటలు వినపడు తున్నాయి. రెండు పురుష కంఠాలు.

"ఎంత కలెక్టు చేద్దాం"

"కనీసం మూడువేలేనా ఉంటేగాని మనచెయ్యి పైగా ఉండదు. బీహారువంటి చోటికి పంపుతున్నామంటే తెనుగు వాళ్ల బారీ తెలియాలి" ఏమంటారు?

"మనం ఇంత శ్రమపడుతూన్నందుకు..."

"ఎంతమాట— ఈరిలీఫ్‌కమిటీకి మీరు ప్రెసిడెంటు— కాకుండా రాజేన్‌బాబు ముఖ్యంగా మిమ్మల్ని గురించి కృతజ్ఞతతో ఉత్తరం రాస్తాడు"

"దానికేంలెండి—సోదర భారతీయులు దైవదుర్విపాకంవల్ల కష్టాలపాలైపోతూఉండగా కాస్త మెదడుఉన్న ఎవని మనస్సు."

"బాబయ్యా, పొద్దుట్నించి తిండిలేదు. ఒక్కముద్ద పెట్టించండి తండ్రీ"

"ఎవరదీ? ఇప్పుడులేదు. గోలచెయ్యకు"

"తెలిసిన మారాజులు—కనికరించండి బాబూ"

"మొండివెధవలు—చెప్పినమాట అర్థంకాదు తగుమనిషితో మాటాడుతూంటే......దయచెయ్యి" తలుపు దడాల్న మూశాడు.

ఇంక ఆశలేదు. ఈరోజు పూర్తిగా తిండిలేదు. నాలుగో వీధికూడా ఆఖరయిపోయింది. ఇక అంతా ఇంతే. ఎవ్వరూ పెట్టరు. అల్యూమినియం చిప్పకేసి చూసింది. దానికడుపూ నకనకలాడుతోంది. "నీకూలేదూ నాకూలేదు బువ్వ— అందరికీఉంది మనిద్దరికేలేదు. మంచి నేస్తులం" నిరాశతో

గిర్రున తిరిగిన రెండు నీటిబొట్లుజారి చిప్పలోపడ్డాయి. చిప్ప తలమీద బోర్లించుకు బయలుదేరింది. ఊరవతల ముష్టివాళ్ల జువ్విచెట్టుకిందకి.

# 3

తెరపి యిచ్చిన ఆకాశంమీది నక్షత్రకాంతిలో సుఖంకనపడు తోంది. బట్టపీలికలు కొంచెం ఒంటివేడికి ఆరాయి. తిండిలేని పడుచువాళ్లు ముసలివాళ్లలా కనపడతారు. తినడానికున్న ముసలివాళ్లు పడుచుగా ఉంటారు. తిండిఉంటే ఆమె పడుచు. మొరిసేకళ్లలోంచి కదిలేరొమ్ములోంచీ ఎంతపొమ్మన్నా యౌవనం పోవడంలేదు.

పరధ్యానంగా నడుస్తూ రోడ్డు కడ్డంగా పడుకున్న కుక్క కాలు తొక్కింది. కుక్క కంయిమని లేచింది. ముష్టిమనిషి నవ్వింది.

"కుక్కలు దిలాసాగా బతుకుతున్నాయి. పురుగులు ఇంకా ఎన్నో నిశ్చింతగా నిద్దరోతున్నాయి. మనిషికి బతుకులేదు. తిండిలేదు. మాటలొచ్చు. మంచిచెడ్డలు తెలుసు...అందుకే తిండిలేదు.

కూలిపని చేసుగోవచ్చు—ఇక్కడ అంతా కూలీలే— చేయించుకునేవాళ్లు కావాలి.

మొగాడు ఎట్లాగో కొట్టుకుతింటాడు. లేకపోతే దర్జాగా మాడుతాడు. కాని ఆడది...లేకపోతే తిండిలేకపోవడమే. ఉంటే...మొగకుక్కలు వెంటపడేటంత..." మనస్సుఅంది.

నడుస్తోంది.

## 4

కనుచూపు మేరలో ఎడంచేతి వెంపుగా మిణుకు మిణుకుమంటూ చిన్న దీపం కనబడింది. దీపంచూడగానే ముష్టిమనిషిఆకలి మళ్లా రాజుకుంది. 'ఎవరో—అక్కడ'

"ఏమైనా దొరుకుందేమో తినడానికి"

"ఎవరో"

"ఎవరుంటే—వారే"

ఆశ రేంటింది. ఆవైపు నడిచింది. దీపాన్ని గుర్తుగా ఉంచుకొని నడచివెళ్లింది.

జట్కాలూ ఒంటెద్దుబళ్లూ నిలిచేచోటు. పక్కని ఒక కూలిపోడానికి సిద్ధంగాఉన్న పాతపెంకుటిల్లు అరుగుమీద మినుకు మినుకుమనే దీపం. దానిపక్క షేక్ ఇషేక్ సాయబు తాలూకు చవకరకం 'టీ—రొట్టెలకొట్టు'. జట్కా సాయబులూ ఒంటెద్దుబండి నాయుళ్లూ దాని రాజపోషకులు.

ఈవర్షపు రాత్రి ఆటే బేరాలులేక ఇషేక్ టీకొట్టు అరుగుల మీదకుచేరి రాజపోషకు లందరూ వెచ్చని టీ తాగి ఇంజన్లలా పొగలు చిమ్ముతూ చాలాసేపు కాలక్షేపంచేసి వెళ్లారు.

## 5

"గెండబనీ జావుంగే సయ్యా తేరీ గోదుమే" ఇషేకు ఖులాసాగా పాడుకుంటూ కొట్టు సర్దుకుంటున్నాడు.

ముష్టిమనిషి చూచింది. నోట మాటరాలేదు. ఎవరో కాపురముండే ఇల్లు అనుకొనివచ్చింది. తిరిగి పోవాలనుకుంది. ఆతురక కంట పడకూడదు. చావగా మిగిలిన హిందూరక్తం గుండెలకు ఎగదన్నింది.

గిర్రున వెనక్కి తిరిగిచూసింది. అంతాచీకటి. నము సినా సపు జువ్విచెట్టు అక్కడికి కుడిచేతివైపుగా నాలుగుఫర్లాంగు లుంది—ఎదురుగా చిన్నదీపం. మనిషి వాసన. వెనక అయోమయం అంధకారం నిరాశ. మళ్ళా జువ్విచెట్టు. ఒళ్ళంతా పీకే చీమలు—ఎముకలుకూడా చల్లబడేచలి. ఈ వర్షానికి చెట్టుకింద బాగా తడిసి నీరుచేరి ఉంటుంది. పక్కనున్నవాళ్ళు తినగా మిగిలిన బియ్యం, అన్నం, పొగాకుకీ, గంజాయికీ, నల్లమందుకీ అమ్ముకుంటారుగాని ఒక్కవెధవా చేరెడు బదులియ్యడు. ఏంబ్రావుకోవాలి అక్కడ ?

ఎదురుగుండా అరుగుమీద టీపాయ్యీ, రొట్టెల జంగిడా కనపడుతున్నాయి.

కాళ్లులాగుతున్నాయి. చలిచేత గుండె పీకుతోంది. నెల్లి నీరసంగా ఒక అరుగుచివర చదికిలబడింది. ఇషేకు, ముందు, కొట్టుసర్దుకునే తొందరలో ఆమెను గమనించలేదు. అన్నీ లోపలపెట్టి టీ 'కెటిలు' పట్టుకువెళుతూ చూచాడు.

"ఎవరూ నువ్వు అమ్మా"

మాటాడలేదు.

"ఎవరికోసం"

ఈ మాటలో ఏదో అపార్థం ఉన్నట్టు తోచింది. కాని లేచే ఓపికలేదు.

"చలిగాఉందీ—పాపం—కొంచెం టీ తాగు"

సురకలకుకూడా దయఉంటుంది గాబోలు—కాని—

"డబ్బులు. లేవు"

దీపం వెలుతురులో ఇషేకు ఆమెను బాగా చూచాడు. తిండిలేకగాని—నల్లదనంలో మెరుగైన శరీరం. "డబ్బుల్ గిబ్బుల్ జాంతానై...ఉల్ఫా" మాటాడలేదు.

పెద్దవి రెండు నాన్‌రొట్టెలు—ఒక కప్పులో టీ తెచ్చి ముందుంచాడు. ఆమె గుండెలు కొట్టుకున్నాయి. లోపలినుంచి ఎవరో 'వద్దు ముట్టుకోకు—మనజాతి...అవమానం...బలి...' అని అరుస్తున్నారు. నరాలు వెచ్చని పానీయానికి, మనస్సు బలమైన రెండు రొట్టెలకీ లొంగమంటున్నాయి.

రెండు రొట్టెలూ హాయిగాతిని టీ తాగింది. లోపల వెచ్చ పడుతూన్నకొద్దీ పై చలిగాలి దుర్భరంగా ఉంది.

ఈదురుగాలికి ఆమె వణకడం అతడు చూచాడు—

"ఏయ్ అమ్మా లోపల్కీ—రా—దోకపడా ఇస్తాన—చలీ గిలీ చల్ జాయగా" అని నవ్వుతూ ఆమె చేయిపట్టుకొని లేవదీసి లోపలికి నడిపించి, వీధి తలుపు వేశాడు.

---

# ప్రేమ దొంగలు

నెల్లిమర్ల మిల్లు సాయంకాలపుకూత చెవులు గింగురుమనేటట్టు కూసింది.

చంద్రమ్మ వులికిపడి ఇసకతిన్నె మీదనుంచిలేచి, ఏటిలోకి దిగి—కడవముంచుతూ—ఆవైపే చూస్తూ, ఎట్టకేలకు, కడవను మోకాలిమీద పెట్టుకుని, ఎదటి ఎర్రని ఆకాశంవైపూ—ఏటిగట్టుమీద మనుష్యులు నడిచే కాలిబాటవైపూ—వెనక్కి తీసుకోలేని చూపులతో చూస్తూ, మజుందారు Lost heart అనే బొమ్మలా అట్లాగే కొంతసేపు నిలిచిపోయింది.

కొంతసేపటికి కడవబుజానికెత్తుకుని ఏటిగట్టు మీదుగా మిల్లు కూలీల ఇళ్లవెంపు చంద్రమ్మ తొందర తొందరగా నడిచిపోతోంది.

ఒకరైలు. మహావేగంగా—పొగలు కక్కుకుంటూ ఏటి వంతెనమీద గుండెలదిరే చప్పుడుచేస్తూ వెనక్కి విజయ నగరంవైపు పరుగెత్తుతోంది చంద్రమ్మ హృదయంలా.

ఆమె నడకలో ఏదో తొట్రుపాటు కనబడుతోంది. అంత చక్కని పాదాల్లో, ఒయ్యారం కనపడవలసిన దానికి బదులు, ఏదో అపశ్రుతిలాంటి ఖంగారు—వినపడుతోంది.

ఆమె వెళ్లి వెళ్లి ఒక తాటాకు ఇంటిముందు ఆగి, కడవ దించుకొని చిన్న అరుగుమీద పెట్టి, ఎందుకో నాలుగు వైపులా చూచి గుండెదిటవుచేసుకుని తలుపులీసి నీళ్లుఇంటిలో

పెట్టింది. అరుగుమీద ఉన్న పొయ్యిలో నిప్పువేసి, కూటికుండ కడిగి— అందులో బియ్యంవేసి నీళ్లు పోసింది. నీటిమీద పటికగట్టుమీది సిరిశపుప్పూలుపడి సన్నని రేకులన్నీ విడి నిర్మలమైన నీటిని కలుషితంచేశాయి. విసుగ్గా వాటినన్నిటినీ తీసివేసి, కుండను పొయ్యిమీదపెట్టి మంటచేస్తూ అరుగుమీద కూర్చుంది.

కాని—

తన స్వచ్ఛమైన మనస్సులో నాలుగు రోజులనుంచి పడుతూ కలచివేస్తూన్న ఆరంగురంగు కోరికలను—అనుభవాలను— ఎట్లా చేత్తో తీసి పారవేయడం?

అబ్బ!

మిల్లుకూత ఎంతహడావడి చేసింది! మిల్లు కుయ్యగానే సోములు ఇంటికి పరుగెత్తుకు వచ్చినట్టు, ఇంటిదగ్గర తాను సమయానికి లేనందుకు ధుమధుమలాడుతూ ఏదో అనుమానమే పడ్డట్టు, లోచి, నాలుగడుగుల్లో, ఇంటికివచ్చి పడింది.

ఛీ వెధవమనస్సు—ఎంతఖంగారు పెడుతుంది! మనిషిమీద మనస్సు ఎంత అధికారం చలాయిస్తుంది. సోములింకా రానేలేదు.

ఈ పాడు తాటాకుఇల్లూ—కోడిపిల్లలూ—మసికుండలూ—గంజికూడూ—మిల్లుకూలి సోములూ ఏమైపోతారో అని పరుగెత్తుకు వచ్చింది. పాపం. ఈ మిల్లునూ—కూలీలనూ అందులో ముఖ్యంగా సోముల్నీ ఈ ఏరు ఒకనాడు చెప్పకుండా హఠాత్తుగా పొంగివచ్చి ఎత్తుకుపోతే బాగుండిపోను.

అన్నంత కోపం వచ్చింది.

నాలుగు రోజులక్రితం వరకూ—ఈ ఏటిఒడ్డున చల్లని నిద్రగన్నేరు చెట్లకింద ఊరికి దూరంగా ఉన్న కాపరం, ఏట్లో నీటిమీద ఎగిరే ఏట్రింతల పాట—ఏట్లో ఈదే బాతుల చిత్రమైన బొంగురు గొంతుకులు—సాయంత్రం మిల్లు పనిలో నలిగి వచ్చిన సోములు మామకు, వేణ్ణీళ్ళుకాచి పోస్తూ, కండలు తేరి, బలిష్ఠమైన అతని ఒళ్ళు, నిమురుతూ, ఏవో సాంసారికపు కష్టసుఖాలు, మాటాడుకునేప్పటి హాయీ, అతని బుజాలకు తగులుతూ, కూర్చుని, ఈ ఏటిఒడ్డున—ఇసకలోనూ గడిపిన రాత్రులూ—ఎంత బాగున్నాయి!

ఇప్పుడంతా విషంలా ఉంది.

ఈ సోములో — కూలీతో — గడపడం చేదుచేదుగా గొంతుదిగడంలేదు.

రేపు సాయంత్రందాకా ఇంతే—

రామ తీర్థాల నల్లకొండలాగ ఈ రాత్రంత గడవాలి. రేపు పగలంతా తిరగాలి. పొద్దు తిరగాలి.

అప్పుడు—ఆ నాజూకు దొరబిడ్డ కనుచూపులో కనపడే ఏటి మళుపుదగ్గర తురాయి చెట్లచాటుకు వచ్చి ఈలవేస్తాడు. ఏదో పాట పాడుతాడు.

అదీగుర్తు!

ఆ ఈల వినగానే శరీరానికి కొత్తగా రెక్కలు మొలిచి నట్టు—మనస్సు పువ్వుల్లో తేలిపోతూన్నట్టు అనిపించి చేతిలో

ఏదిఉంటేఅది విసిరేసి, అడ్డుగా ఉన్నదాన్ని తోసేసి, పట్టరాని ఉల్లాసంతో, పరుగెత్తబుద్ధి—గదా.

పరుగు పరుగున తురాయిచెట్ల దగ్గరకువెడితే కనపడడు. తీగతీగా ఆకుఆకూ వెదుకుతూ ఉండగా ఏపొదలోనుంచో వచ్చి, హఠాత్తుగా కాగలించుకుంటాడు. ఎంతమంచిబట్టలు తొడుక్కుంటాడు! బట్టలన్నీ ఎంచేతో ఘుమఘుమ లాడుతూ ఉంటాయి.

నాచేతిలో కడవ ఊడలాగి దూరంగా నీటిలోకి విసురుతాడు. పగిలిపోతుందేమో అనే నా భయంచూసి పదికుండల ఖరీదిదిగోఅని డబ్బులు ఇవ్వబోతే అతనిదగ్గరా నాకూ వచ్చినట్టుంటుంది. డబ్బులు పుచ్చుకుని ఇసకలోకి విసిరితే నవ్వుతూ నా చేతులు ముద్దుపెట్టుగుంటాడు. నేనేవరి జేబులో వేస్తాను. తానేవెళ్లి కడవ తెస్తాడు. ఇసకలో ఆట. గంటలకొద్దీ ఎంత తియ్యగా మాటలాడుతాడు. ఎప్పుడూ వినని కొత్తసంగతులు. తనకు రెండు మేడలున్నాయుట. తనను నాటకంలో వేషం వెయ్యమని రోజూ పెద్దపెద్ద ఊళ్లనుంచి వంద ఉత్తరాలు ఒస్తాయుట. నాటకానికి వంద రూపాయలు పుచ్చుకుంటాడుట. నాటకంఅంటే ఏమిటో!

తానుపెళ్లి చేసుకోలేదు తగినపిల్ల దొరకక. ఇంతవరకూ ఏపిల్లనూ కన్నెత్తి చూడలేదట. నా అదృష్టం పండింది. ఆ పట్టు బట్టలు, దర్జా, బారీ, చూస్తే నిజంగా దొరబిడ్డ అనిపిస్తుంది.

పెళ్లీ—మగడూ అంటే వెక్కిరింతగా నవ్వుతాడు. చిన్న బోతే ముద్దుపెట్టుకుంటాడు. అబ్బ ఒళ్లంతా వెచ్చగా అయి పోయి ఎటో తేలిపోతూ ఉంటుంది. అందం ఎక్కడఉన్నా పువ్వులతో పూజచేస్తాట్ట.

ఈ మాటలతో మనస్సు రెక్కలుకట్టుకుని అతడితో ఎగిరి పోతుంది.

కట్టెమాత్రం తాటాకుకొంపకు చేరుతుంది. సోములు పీక్కుపోయిన మొహంతో అమాయికంగా కనిపిస్తాడు. ఏమీా తెలియదు. పగలంతా మిల్లు పనిచేసి సాయంత్రానికి కొంప జేరి 'చంద్రా—కూడెట్టు' అని తిని పడుకుంటాడు. జాలి వేస్తుంది. ఏంచెయ్యాను?

పరధ్యానంలో ఈ ఊహా ప్రవాహం విడివడింది. ఎసరు బుసబుస పొంగి పొయినిండా పడింది. విసుక్కుంటూ తిట్టు కుంటూ మళ్లా తంటాలుపడి వంటచేసింది.

సోములు వచ్చాడు.

చామనచాయగా పొడుగుగా ఉంటాడు. సంస్కారహీన మైనా బలమైన చిక్కని శరీరం. కూలీలు తొడుక్కునే మూడు కుట్ల చిన్నచొక్కా తొడుక్కున్నాడు. కళ్లల్లో బాధా, ఓర్పూ, అమాయికం వేరువేరుగా కాపరం చేస్తున్నాయి.

నెమ్మదిగా ఇంటిలోకివెళ్లి చొక్కాతీసి, ఒకతాటికమ్మ కాడకు తగిలించి, పాతగుడ్డఒకటి పైమీాద వేసుకుని, వాకిట్లోకి వచ్చాడు.

"కాసిని ఉడుకునీళ్లు ఇలా తెచ్చిపెట్టు. ఈ పొద్దుచాలా బద్ధకంగా ఉంది" అన్నాడు.

చంద్రమ్మ ఇదివరకు వేణ్ణీళ్ళు పెట్టేది. ఈ వేళ లేవు. వంటకే పొద్దుపోయింది. పరధ్యానంగా ఉండడాన్ని పొయ్యి రెండు సార్లు మంటచెయ్యవలసి వచ్చింది.

"ఈయేళ, కూడుడకడవేఁ, గగన, వైఁపోయింది.

ఏటికెళ్ళు. రేపునుంచి కాస్తాలే—" అంది.

సోములు మారుమాటాడకుండా ఏటికెళ్లి వచ్చాడు. "చంద్రా! చింతాకు పచ్చట్లో ఉప్పాగల్లేనేదు... ఈ పులుసులో తాలింపు లేదు...ఏటే ఈ వంటా?" అన్నాడుపాపం దాకలో పెట్టిన కూడు పిసులుతూ.

"............"

"............"

"మావాఁ! ఈ పొద్దు, నాకు, తలనెప్పిగా, వుంది... అవతలరుగుమీద ఆ, నులకమంచం, వాల్చుకు, పడుకో,... చాపగుడ్డేసుకుని, నేసి అరుగుమీద ఒరుగుతా" అంటూ ఈత పాతచాప తీసింది చంద్రమ్మ.

## 2

శ్రీ చిట్టి వెంకటసీతారామచంద్రబాబు మొన్న మొన్ననే చిదికిపోయిన శృంగివలస కలింగజమిందారీ కుటుంబానికి చెందినవాడు. ఆయన్ని మిత్రులూ చనువైనవారూ క్లుప్తంగా రాంబాబు అంటారు.

'దాయూపాఠీ' లకు, సీమకుక్క లకు, గుఱ్ఱపుపందాలకూ, దినదినమూ కొత్తచవులూరించే శోభన దేవతలకూ, జమీందారీఅంతా ఆహుతిఐపోగా చెడగా మిగిలిన సుకుమార శరీరంతోనూ, ఒకపాటి కూని రాగంతోనూ శ్రీరామచంద్ర బాబుగారు ఆంధ్రలోకంమీదపడ్డారు. ఏఉద్యోగం సంపాదించా లన్నా దరిద్రగొట్టు చదువొకటి అడ్డంవచ్చింది. ఎట్లాగో లోకాన్ని కొట్టుకుతినాలి. తప్పదు ఇక—అన్ని తరహాలకూ— మతాలకూ, ఆతిథ్యంఇచ్చి ఎప్పుడూ సింహద్వారం తెరచి ఉంచింది ఒక్క–నాటకరంగం దానికడుపు చల్లగా—కనపడింది.

శ్రీరామచంద్రబాబుగారికి నాట్యకళను చేపట్టాలని బుద్ధి తిరిగేటప్పటికి, సరిగ్గా అదే సమయంలో విజయనగరంలో ఉద్భవించిన ఆంధ్రరంగోద్ధారక నాట్యమండలివారు శ్రీరాం బాబుగారిని ఆహ్వానించి ఆరునెల్లు ఉచ్చారణ నేర్పి మంచి అభినేతగా తయారుచేశారు. ఆయన దేశంలో పలుతావుల తన అభినయకౌశలం చూపి 'శృంగారరంగ' అనే బిరుదం పొందారు. ఇప్పుడుచాలామంది స్నేహితులు ఆయన్ను ఆబిరుద నామంతో 'రంగబాబు' అంటారు.

రంగోద్ధారక నాట్యమండలివారి నాటకాలుసుమారు రెండు నెలలనుంచి ముమ్మరంగా జరిగాయి. కంపెనీ మానేజరుగారు మరిరెండు నెలలవరకూ నాటకాలువెయ్యము, అనీ నటులు తమతమ గ్రామాలకు వెళ్లి రావచ్చుననీచెప్పి, తలో 50 రూపా యలుఇచ్చి, పంపివేశాడు. రంగబాబు శృంగివలస వెళ్లదలచి

పోనీ ఒకసారి వెళ్లి మర్లలో ఉన్న మిత్రుణ్ణి చూచి మరీస్వగ్రామం వెళ్లవచ్చునని నిశ్చయించి నాలుగు రోజులయింది నెల్లిమర్ల వచ్చాడు.

స్నేహితుడు చాలా సంతోషించి రంగబాబును వారంరోజుల వరకూ తనవద్ద ఉండిపోవాలని బలవంతంచేశాడు. రంగబాబు మిత్రుడిమాట తీసివేయలేక ఆగాడు. మిత్రుడు ఏదో తొందర పనిమీద గ్రామాంతరం వెళ్ళుతూ సాయంత్రానికి తిరిగివస్తా నని చెప్పాడు.

రంగబాబు కొంతసేపు ఏదో పుస్తకం చదివి—విసుగు రాగా—ఏటి ఒడ్డుకు షికారు వెళ్లాడు.

మార్చినెల. ఏరు తక్కువనీటితో ఇసక పొరలమీదా— గులక రాళ్లమీదా స్వచ్ఛంగా పారుతోంది. కొద్దిగా వెచ్చ గిలే ఎండ. చురికి అప్పుడే చల్లబడుతోంది. మంచిగాలి తిరిగి ప్రాణం లేచివస్తోంది. రంగబాబు నీటికి దగ్గరగా ఇసకలో కూర్చుని ఒక నాటకంపాట సన్నంగా అందుకున్నాడు. సాయంకాలపు గాలికెరటాల్లో ఆ పాట పరుగెత్తి మొగలి పూల పరిమళంలా ఎక్కడ ప్రాణిఉన్నా పట్టి ఆపుతోంది. చుట్టూఉన్న ఆకాశం ఆనందపులకితమై— ఆ పాట నొక్కుల హాయికి కరిగిపోయింది.

సరిగ్గా అదే సమయంలో అనతిదూరంలో ఉన్న రేవులో కడవతో నీరు ముంచుకోడానికి వచ్చింది ఆ పల్లెటూరి పడుచు చంద్రమ్మ.

నల్లచుక్కలచీరా— సెనగపువ్వులరైకా తొడుక్కుంది. నల్లనికేశపాశంలో ఒక తురాయిపువ్వు, ఒక సిరిశపు పువ్వూ, పెట్టుకుంది. అస్తమించే సూర్యకాంతిలో ఆమె శరీరంలోని యౌవనం మెరుస్తోంది.

చంద్రమ్మ కడవముంచి మోకాలిమీద ఉంచింది. కాని బుజానికెత్తుకోలేదు. ఆ పాట వింటూ అతన్ని చూస్తూ బాహ్యప్రపంచం మరిచిపోయింది.

రంగబాబు పాట ఆపి ఆమెను చూచాడు. ఆ చక్కని పల్లె పడుచు అంతవరకూ తనవైపు చూస్తూ—తాత్కాలికంగా చూపులు తిప్పుకోవడం గమనించాడు. రంగబాబు పెద్ద జమీందారుబిడ్డ. చెప్పదగ్గ స్త్రీవేటగాడు. వలరాజు వల ఒక్కసారి ఎరువుపుచ్చుకు బయలుదేరాడు.

హఠాత్తుగా అతడు సమీపించేసరికి ఆమె కడవ పట్టుకుని ఇసక తిన్నెమీదకు వచ్చింది.

“పిల్లా—పాపం ఒక్కర్తెవూ—కడవ బుజానికి ఎత్తమన్నావా?” కడవ ఎత్తబోయాడు.

కనుకొలకుల్లోంచి అసాధారణంగా చూస్తూ—“వద్దండీ— వద్దు, మాకు అలవాటే—ఒంటిగా ఎత్తుకోవడం” ఆకుచాటు మల్లెపూవులా సిగ్గులో కులికింది.

అతడు వినిపించుకోలేదు. కడవపట్టి బుజానికెత్తాడు. ఆమె వద్దువద్దంటూ కడవ బుజానికెత్తుకుంది.

అతలి మెత్తనివేళ్లు తగిలి ఆమె చెయ్యి ఒణికింది. కుండలో

నీళ్లు తొణికి ఆమె అవికళొంచెం తడిసింది.

"అరే—నీళ్లుజారి తడిసిందా" నవ్వాడు.

"పోనీ... లెండి..." కోపంతో తీపిగానవ్వింది. అర్థమయింది.

ఎవరితోవల్లో వాళ్లు నడచివెళ్లారు.

## 3

తెల్లవారితే స్వగ్రామం వెళ్లిపోవాలి. రంగబాబు శరీరం ముందుకు—మనస్సు వెనక్కు—ఏమీ పాలుపోవడంలేదు. వచ్చి అరురోజులైంది. సాయంకాల మయేసరికి ఏటిబడ్డు ఒక రసవద్రంగ స్థలంలాఉంది. ఈరోజునఏదోఒకటి తేల్చుకోవాలి.

ఆ రోజు పగలెట్లాగో గడిచింది.

సాయంకాలమయింది. రంగబాబు క్రాపుచక్కగా దువ్వుకుని—లేతఊదాసిల్కులాల్చీ తొడుక్కుని—పట్టుగళ్లలుంగీ కట్టుకుని కొత్తరకం చెప్పులు తొడుక్కుని ఈ రెండ, ఉండగానే ఏటిబడ్డు తురాయి చెట్లదగ్గరకుచేరి, కొంతసేపు, పచారుచేసి, ఇసకలో, కూచున్నాడు. ఒరిగాడు, తురాయి పువ్వుల, ఈనెలు, లెక్కపెట్టాడు. గట్టిగా, చూపుడువేలూ, బొటనవేలూ, వల యంగాచేసి, నాలికకింద పెట్టి, ఊదాడు, మిల్లుకూలీల ఇళ్లవైపు చూస్తూ.

"రాత్రిర్లో మనతోటకాడ—ఒక్కణ్ణి—

నాతిప్పలీశ్వరుడు లేడా" అనే మెంకిపాట అందుకుని ఏటిలోనీరు తాగే ఆవులనూ, నీటిమీద ఎగిరే కాటుకపిట్టలను ఆపివేశాడు.

పాటముగియలేదు.

ఆకుపచ్చరంగు నేతచీరకట్టుకుని, బటాణీచుక్కల తెల్ల రవిక తొడుక్కుని తలలో నాగమల్లెపూవులు పెట్టుకొని, నడకనుమించిన తొందర కళ్లలో చూపుతూ వన్నెల చిన్నారి కాపుపడుచు చంద్రమ్మ తురాయి చెట్లకిందకువాలి...అప్ర యత్నంగానే చప్పట్లు చరిచింది.

అతడు తిరిగి చూడలేదు.

కొండచరియల మీదనుంచి ఒకవింత హొయలుతో జాలు వారే సెలయేటి కన్నెలాగు చంద్రమ్మ గట్టుమీదనుంచి ఇసకతిన్నెల మీదకు చట్టున ప్రాకింది. రంగబాబు తెచ్చు కొన్న కోపంతో పెదవులు బిగించుకున్నాడు.

తెల్లబోయింది. కంటనీరు పెట్టుకుంటూ, తన సంసారం, మగడు, చుట్టుపక్కలవాళ్లు, అపకీర్తి, తనమనస్సులో నిత్య బాధా, అన్నీ కోలకళ్లలోంచి జాలిగా చూస్తూ చెప్పింది.

అతడు చంద్రమ్మవైపు తిరిగాడు.

నిగనిగ మెరిసే ఆమెతలనూ, నున్నని ఆమెభుజాలను నిమురుతూ, తలలోని నాగమల్లె పూవులను పుణికి సర్దుతూ, "చంద్రా—రేపుఉదయం నాప్రయాణం—ఇంతకంటె ఇక్కడ ఉండడం కుదరదు. నిన్నువిడిచి వెళ్లాలనిలేదు. వెళ్లినా, కన్ను మూస్తే నువ్వే ఎదురుగాఉంటావు. ఎవరూ ఇంతగా నన్ను స్వాధీనం చేసుకోలేదు......" అని అతడుచెబుతూండగా ముందు చంద్రమ్మ తెల్లబోయి "అప్పుడేనా" అనిగొంతుకులో

ఏదో పట్టుకొన్నట్టు మాటాడలేకపోయింది. రంగబాబు లాలనగా దగ్గరగా జరిగి ఒత్తుగా ఆమెను గుండెలకు హత్తుకొని అన్నాడు.

"ఎందుకిక్కడ ? ఈ మొగుడూ, చాలీచాలని గంజికూడు, కోడిపిల్లలు, ఛా—ఇక్కడ ఏంబాగుంది ? చెప్పు—ఆలోచించుకో—నాతో—ఎన్నో పట్టణాలు—మంచి బట్టలు—నాజూకు వేషం—రాజాభోజనం—నిన్ను కాలు కిందపెట్ట నివ్వను. పువ్వుల్లో నడిపిస్తాను. ఏం? తెల్లవారుజామున మొదటి మిల్లుకూత వెంటనే రోడ్డుమళుపులో సిద్ధంగాఉండు." అరచేతిలో స్వర్గం చూపించాడు. చంద్రమ్మ ఎందుకో వెర్రిగా చుట్టూ చూసింది. తనఇల్లూ—మిల్లూ—సోములూ—గిరగిర తిరిగి ఏటిలోకిఒరిగి పోతూన్నట్టు కనిపించి ఏడ్వబోయి ఆపుకుని "అమ్మో—నేను—రాను" అని నీళ్ళుతిరిగే కళ్ళను పక్కకు తిప్పుకుంది.

"నీకూ ఎవ్వారులేరు నాకూ..." అంటూ అతడు చెయ్యి పట్టుకు లేవదీశాడు. ఆమె వెన్నలా కరిగిపోయింది.

## 4

శృంగివలసలో జమీందారుగారి కూలి పోయేమేడలో ఒకవైపు చిన్న కునికేదీపం, రెండు నులకమంచాలు అప్పుడప్పుడు ఒక చంటిపిల్ల ఏడుపూ నిద్రపోయే ఆభవనం కలవరింతల్లా—గోచరిస్తూంటాయి. పూర్వం పెద్దజమీందారుగారు బాగున్న

ప్పుడు ఆభాగం వేటకుక్కలు కట్టివెయ్యడానికి, బాతులు, కౌజుపిట్టలనివాసానికీ ఉపయోగించేవారు. కనుక ఇంతకుపూర్వం అక్కడ ఎవ్వరూ కాపురం ఉన్నజాడలేదు. ఈమధ్య సుమారు ఏడాదినుంచి ఒకకుటుంబం అక్కడచేరింది.

ఒకనాడు రాత్రిపదిగంటలకు ఆభాగంలో చిన్న కలవరం బయలుదేరింది.

"వారం రోజులనుంచి మాడుతున్నాం—చంటిపిల్లా నేను —మీారు ఒక్కరోజు తాగుడుబుడ్లకు పెట్టేఖర్చు మాకు రెండుమూడురోజులు తిండికిచాలు. నాలుగురోజుల కోసారి మీారు ఇంటికి వస్తూంటే చెప్పుకునే దిక్కుకూడాలేదు. ఎందు కిలా—కోసికోసిచంపడం—ఒక్కసారి నరికి పారెయ్యరాదూ మమ్మల్ని" మాసిన చీరకొంగుతో కళ్ళుతుడుచుకుంటూ అంది. తలఅంతా చిక్కులుపడి చెదిరిపోయి ఉంది. ఖాయిలా పడ్డట్టు చెక్కిళ్ళు పీక్కుపోయాయి. నులకమంచంమీాద పది నెల్ల వయస్సుగల చంటిపిల్ల ఏడ్చేఓపికలేక మూలుగుతోంది.

రంగబాబు గోడదగ్గరగా ఉన్న చాపమీాదకూచుని ఒక బుడ్డిలోంచి గ్లాసులోకి ఒంచి తాగుతున్నాడు. సమాధానం చెప్పదలచు కున్నట్టులేదు. పదినిమిషాలు గడిచాయి.

"పాలులేని ఈపిల్ల గోడుచూస్తూ నేనింకబతకలేను... ఇక్కడ ఉండలేను..." అందిపాపం పిల్లపక్క మంచంమీాద ఒరుగుతూ.

నిషా బాగా నరాల్లో ప్రవేశించింది.

"ఫో... కావలిస్తే... సంపాదించుకు తిను... ఇక్కడ ఉండ లేవు... ఔను ఉండలేవు... ఇంకోణ్ణి చూసుకో... బాగా ఉన్న వాణ్ణి... పతివ్రత... పాపం! నేనెవర్నో వాణ్ణో..." చంద్రమ్మ తాచులాలేచింది.

"ఇన్నాళ్లూ తిండిలేకపోతే ఓర్చుకున్నాను. గుడ్డపేలికలు కప్పుకొని మానభంగానికైనా వెరవకండా ఓపికపట్టాను... చంటిపిల్ల పాలకేడిస్తే రక్తంఒడిని బతిగించాను. ఇదంతా నా కోసంకాదు. నీకోసం. నీమీది వల్లమాలిన మోహంకోసం. నాటకాలంటే—కల్లబొల్లి మాటలంటే మోసంచేసి ఎదటి వాళ్ళని పడగొట్టడమంటే అప్పుడు నాకు తెలియదు. నీతో ఊళ్ళుతిరిగి రకరకాలమనుష్యుల్ని చూసి నేనన్నీ నేర్చుకున్నాను.

ఏంలాభం—కళ్లను మిరుమిట్లుగొలిపే నీ డాబువేషాలు, నాటకవుటక్కులు చూసి ఆదిక్కులేని అమాయికుడికి ద్రోహం చేసి వచ్చాను.

అందుకు నేనిప్పుడు విచారించను.

నిన్నే నమ్మి, మోహంచేత, అందనికోరికలు తీరుతాయనే దురాశచేత వచ్చినందుకు ఈనాటికి నోటికివచ్చినట్టూ అన్నావు. కదూ? నేనుతిండికోసం నీతోరాలేదు జ్ఞాపకం తెచ్చుకో. ఆడది మనస్సు ఇచ్చిందంటే తీసుకోడం ఎరగదు. రోజూలక్షగడ్డులు కరుస్తుంది గనక మీామగజాతి, అంతా అట్లాగే అనుకుం టావు—ఇదిగో పోతున్నాను. ఎందుకోసం? తిండి సంపాదించు కోవడంకోసంకాదు. కుక్కలమాత్రం బతగలేకపోము. ఇప్పుడు

నీదయవల్ల...నీకన్న దర్జాగా బతగడం నేర్చుకున్నాను.

ప్రేమపేరుచెప్పి ఏమీఎరగని అమాయికురాళ్ల మానం దోచుకునే నీలాంటిదొంగలను చేతనైనంతవరకూ కసితీరా హింసించడానికి— నేనొక అగ్నిహోత్రాన్నయి—మగమిడతల్ని లాగగలిగినంతగా లాగి బూడిదచేసి మరీఆరిపోతాను" ఉద్వేత్తుగాలేచి ఊడిపోయిన జుట్టుముడి వేసుకుంటూ చంటి పిల్లను ఎత్తుగుంది. రంగబాబు చింతనిప్పుల్లాంటి కళ్లను తీవ్రంగా ఎత్తాడు "నోర్మూయ్—ముండా—లేచివచ్చిందానికి ఎంత పొగరూ! గుమ్మందాటితే నరికిపారేస్తాను." అనితూలుతూ లేచి ముందుకునడిచే ఆమెచేయిపట్టుకు వెనక్కు గుంజాడు. ఆమె అతన్ని గోడపైకి ఒక్కతోపుతోసి ఆడుపులిలా రెండు అంగల్లో వీధులోకి వచ్చిపడింది.

రంగబాబు విరిగేనిషాలోంచి తెరవలేని కళ్లను తెరవ బోతూ "నీగతి...అంతే...చావు" అని నీరసంగా మూలిగాడు.

---

# దార్జన్యం

"ఎక్కణ్ణించి—అమ్మాయీ?"

"...విజయనగరం"

"అంటే?"

"........."

"ప్రభాకరం బావా ?"

"కాదు"

"జనార్దనం"

"ఊహుఁ"

"చిన్నమామయ్య గారబ్బాయి...ఏమంటాడు"

"ఏమీ అనడు"

కోపంవచ్చింది. "బొంకులు దిబ్బమీద ఎవడో 'కోక్‌కిస్కా'—ఎవడైతే ఎవడికెందుకావలి ? కాకపోయినా ఈచదువుకున్న ఆడపిల్లలికి మరీఒచ్చింది. శాస్త్ర పెద్దాపిన్నా—తారతమ్యం—బొత్తిగా నశించింది. వాళ్ళను అని, ఏంలాభం—ఈ కొరివితో తలగోక్కున్నాం. అనుభవిస్తున్నాం. బాగుందమ్మా—బాగుంది. దేశంలో ఆర్షవిద్య నశించగానే కట్టుబొట్లూ నశించాయి" సీతారామయ్యగారు వేదధర్మహాని కోసం ఒకసారి విలపించి తనమామూలు కోర్టు వ్యవహారవు కాగితాల్లో పడ్డారు. సరస్వతి అందుకుంది. "అన్నయ్యా, ఆదస్తావేజు ఎప్పుడు ఎందుకురాసింది ?"

"నీకు తెలియదు"

"ఐనా చెప్పిచూడు—"

"నాకు కోపం తెప్పించకు—నీధోరణి ముదిరిపోతోంది. నీకు ఈ మాలచదువు చెప్పించి నా కొంపమీదకు నేనే తెచ్చుకున్నాను."

"తలనున్నగా చేయించి, బిందెఇచ్చి నూతికి పంపక పోయావు—నీమతం—నాఆ స్తి అన్నీ సురక్షితంగా నిలుచును."

"ఆపొరపాటుకే ఇప్పుడు విచారిస్తున్నాను."

"పొరపాటుచేతనైనా నువ్వు ఒక్కసత్కార్యం చేసినందుకు నేను పొంగిపోతున్నాను. మీదార్జన్యాలు కొన్నైనా చూడడానికి నాకన్ను తెరిపించి పుణ్యంకట్టుకున్నావు. అదేపదివేలు"

"చాలించు పాండిత్యం"

"కదిపింది నువ్వు"

## 2

ఏమిటో తిక్కగాఉంది. సరస్వతి చరచర మేడమీదకు వెళ్ళి ఒక సోఫాలో చదికిలబడి కిటికీలోంచి దూరంగా కనబడే కొండలనూ, ఆకాశపునీలాన్ని చూస్తోంది. "ఈ చిన్నవిషయానికి అన్నయ్య ఎంత రగడపెంచాడు! నాకోస్నేహితుడు ఉత్తరంరాస్తే అది అతనికి చూపించాలట. తనఉత్తరాలు నాకు చూపిస్తున్నాడా? చెడిపోతానని భయమా? అంటే తనకు, తలవంపులు—ఫలానాయన చెల్లెలు...కులానికిమచ్చ. ఆ కులగౌరవం కాపాడేబాధ్యత నాకే ఒదిలిపెట్టకూడదూ? ఉహుఁ పనికిరాదు. ఆడది తప్పుచేస్తుంది. మగవాడు కాపాడాలి. ఇదీ వారిసిద్ధాంతం.

చిన్నన్నయ్య కలకత్తాలో స్వేచ్ఛగా ఒకబంగాలీ పిల్లను చేరదీసి దానికూడుతిని వస్తే అన్నయ్య కులమర్యాద చెడలేదు.

ఎందుచేత? అతను సాటిమగవాడు. ఫర్వాలేదు. నేను ఆడదాన్ని ఎప్పటికీ 'మైనార్టీ' తీరనిదాన్ని.

ఈచదువును తిడతాడు. పిచ్చివాడు. మహాప్రవాహంలా వచ్చిపడే ఈనాగరికతను కొత్తఉూహల్ని ఏంచేస్తాడు? ఎన్నాళ్లు కన్ను కప్పగలడు? సనాతనమతాన్నీ వేదాన్నీ పొగుడు కుంటూ తిరిగి నవనాగరికతను, సిద్ధాంతాల్నీ తిడతారు. మళ్లా కొడుకులకు ఇంగ్లీషుచదువు తప్పదు. మొదటినుంచీ 'మిల్టన్' పేరు విన్నవాడు వాల్మీకిని ఎట్లాపొగుడుతాడు? లేదని తగాదా పెట్టే మూర్ఖులనుచూస్తే నవ్వొస్తుంది. వీళ్లను ఏడిపించడాని కైనా తిరుగుబాటు తేవాలనిపిస్తుంది" చేతిలో కవరు జారి టక్కున కిందపడడంలో ఆలోచనా ప్రవాహం అటుతిరిగింది.

ఈస్నేహం ఎంతచిత్రమైంది! కిందటివేసంకాలం సెలవుల్లో చిన్నమామయ్యకు జ్వరంగా ఉందని తెలిసి అమ్మా నేను, విజయనగరం వెళ్ళడమేమిటి? అప్రయత్నంగా ఈ 'జోసెఫ్' కనబడ్డం—మైత్రీ—ఏమిటి? తలచుకుంటే నాకే నవ్వువస్తుంది. కన్నుమూసుగుంటే అదృశ్యం కళ్లలో తిరుగుతుంది.

చిన్న మామయ్యను విజయనగరం పెద్ద హాస్పిటల్‌లో చేర్చారు. సుమారు 15 రోజులనుంచి అతనుబాధపడుతున్నాడు. డాక్టర్లు ప్రమాదం తప్పిందన్నారు. అమ్మా, నేనూ ప్రభాకరం ఒకరువిడిస్తే ఒకరం మామయ్యను కనిపెట్టుకు ఉండేవాళ్లం. మామయ్యను చేర్చిన వారంరోజులకు ఒకకాలేజి విద్యార్థిని నలుగురు విద్యార్థులు తీసుకువచ్చి హాస్పిటల్లో చేర్చారు.

న్యుమోనియా జ్వరం అతనికి. రెండు ఊపిరితిత్తులూ చెడ్డాయి. మామయ్యగదిలోనే అతని 'బెడ్' కూడా. కాలేజివిద్యార్థులు చుట్టపు చూపుగా టిప్‌టాప్‌గా చూడడానివచ్చి కాస్త కాలుమోపి తియ్యనిమాటలాడి చక్కాపోయేవారు పగలు. ఎట్లాగో గడిచేది.

రాత్రిబండరాయిలా కదిలేదికాదు. పాపం అతడుఒక్కడూ ఆక్రిష్ణయ్యను కనిపెట్టుకుని ఉండి అతని పెదవులకు లాలనగా మందు అందించి బట్టకప్పి గాభరాపడుతూంటే డాక్టర్లదగ్గరకు పరిగెత్తి—పాపం ఎంత బాధపడేవాడు!

ఒకొక్కరోజు, నేనొకర్తనూ చాలసేపు మామయ్యను కని పెట్టుకొనిఉండేదాన్ని. అతడొక్కడూ అతన్ని. కొంచెం క్రిష్ణయ్యకు నిద్రపడితే ఏఇంగ్లీషు నావెలో చదువుదామని తీసేవాడు. నాలుగుపుటలు చదివేసరికి అతడు మొర్రోమని ఏబాధతోనో కదిల్తే ఇతడు పుస్తకం గిరవాటుపెట్టి అతనిదగ్గరగా వెళ్లేవాడు.

ఒకసారి మామయ్యకు శోషవచ్చింది. అమ్మ పాలకోసం వెళ్లిరాలేదు. ఏమీతోచక కంగారుపడుతున్నాను. డాక్టరుతో చెబుదామని పరిగెత్తాను. కనిపించలేదు. తిరిగివచ్చాను.

జోసెఫ్, మామయ్యకు తమఫ్లాస్కులోని పాలునెమ్మదిగా తాగిస్తున్నాడు. ఎంతదయ! మానవత్వం! అతడు భగవంతుడులా కనపడ్డాడు.

"ఎంతపని చేశారు...క్రిష్ణయ్యగారికి కావలిస్తే..." ఆత్రంగా అన్నాను.

చిరునవ్వుతో "అమ్మగారు తెస్తారుగా" అంటూ వెళ్ళాడు. "అమ్మ అప్పుడే రాదేమో" అన్నాను. "పరిగెత్తి కాఫీ హోటల్లోనుంచి తెస్తాను. ఆగుతుందా!" అన్నాడు.

అతని ఔదార్యానికి, స్నేహబుద్ధికి ముగ్ధురాలనై పోయాను. అతనిపొందిక—తెలివి, చూడగా నాకతనిమీద అపార గౌరవం కలిగింది.

రోజూ ఏవో కొత్తకొత్త పుస్తకాలు తెచ్చేవాడు ఇంగ్లీషు—తెలుగు పత్రికలు. చనువుగాతీసి చదివేదాన్ని. ఏవో తన ఆశలు భవిష్యత్తులు చెప్పేవాడు ఆవొచ్చీరాని తెనుగు పలుకు బడితో. ఇంగ్లీషులో పిడుగు. నిజానికి నన్ను చిత్రంగా ఆకర్షిం చాడు. క్రైస్తవుడని జ్ఞాపకంవచ్చినప్పుడల్లా మనస్సుకు వికారంగా ఉండేది.

మరినాలుగు రోజులుగడిచాయి. పాపంకృష్ణయ్య దక్కలేదు. జోసెఫ్ దొర్లిపడ్డాడు. అతని నల్లనికళ్ళవెంట ఏకధారగా ముత్యాలదండ తెగినట్టు రాలినకన్నీళ్ళు ఇప్పటికీమరవురావు.

అతడు తుదిగా వెళ్ళిపోతూ ఇక్కడ ఒకగొప్ప స్నేహితుణ్ణి పోగొట్టుకున్నాను. ఇంకోఉత్తమ స్నేహితుల్ని సంపాదిం చాను. మనజీవయాత్రలు ఎంతచిత్రమైనవి! అని నమస్కరించి చిరునామా తీసుకుని వెళ్ళిపోయాడు. పాపం మరిచిపోలేక ఈ 'క్రిస్మస్ గ్రీటింగ్స్' పంపాడు.

అన్నయ్య దీనికెంతరాద్ధాంతం చేశాడు! చూపిస్తేపముంది? మూస్తే అంతా అనుమానమే. తెరచితే ఏమీలేదు. నీడ

లొొక్కకు భయపడేవాళ్ళను చూస్తే ఏడిపించబుద్ధి—పెద్ద లయినాది పిన్నలయినాది.

## 3

"హారీ!"

"ఓయ్"

"'అమృత్' లో ఏమిటీ?"

"విప్రనారాయణ"

"నారాయణ నారాయణ"

"పోనీ—'హనుమాన్'లో ఇల్లాలు"

"దాన్కీల్లు బంగారంగానూ"

"కృష్ణాలో సక్కూబాయి"

"అక్కరలేదు"

"తెలుగుసినీమా అక్కర్లేదని చెప్పకూడదూ"

"ఒక్కమాటా? కావలిస్తే పదిమాట్లు చెబుతాను."

"అభిమానంలేకే మనజాతిఇలా కుంగిపోతోంది."

"అమ్మ విషమిస్తుంది అభిమానించి తాగు"

"ఖైమయిపోతోంది...'జయా' లో ఏమిట్రా!"

"విద్యాపతి"

"అమ్మయ్య...బతికించావు..."

'షష్టుషో'కి రెడీ...వంటయిపోయింది."

"హారీ!"

"బాబోయ్ అన్నయ్యా." అని హరి నాలిక కరుచుకుని నక్కాడు.

"సరస్వతీ!"

"ఊఁ"

"ఎక్కడికేమిటి సన్నాహం!"

"సినీమాకి...మంచిఫిల్ము ఒచ్చిందిట"

"మంచివి రానిదెప్పుడూ?"

"అడగ్గానే నువ్వు పంపిందెప్పుడు?"

"అమ్మా, వీటివల్ల పుణ్యమా పురుషార్థమా? అమ్మకు కాస్త భాగవతం చదివి వినిపించరాదూ"

"అన్నయ్యా ఇహంకంటె పరంమీద నీకెక్కువ ఆసక్తి. నాకు వినోదాల మీదనుంచి బుద్ధి ఇంకా విరగలేదు. అమ్మకు నువ్వు వినిపించు"

"వాడికి పరీక్షలు...చదువుకోనివ్వవన్న మాట—"

"అస్తమానూ చదివితే అసలు మతిపోతుందని ఈరోజు 'సినీమావళి' సంపాదించి తెచ్చినవాడు వాడే"

"మీ యిష్ట మొచ్చినట్టూ ఏడవండి"

"త...థా...స్తు"

## 4

"హరీ!"

"ఆఁ"

"రత్నావళి తెసిగింపు నాటకమైనా చదివావా?"

"లేదక్కా"

"అందులో దీనిలోలాగే మొట్టమొదట్నే అద్భుతమైన వసంతోత్సవంవచ్చి మన్ని పరవశుల్ని చేస్తుంది."

"ఛాయాదేవి ప్రేమనటన ఎంతచక్కగా ఉందో చూశావా?"

"అబ్బాయీ—ఈ మాట చెవిలో మోగడంలేదూ? కవివెనకాల అనూరాధ వస్తాంటేరాజు అన్నది—కవి కేసాధ్ కవితాభిఆయా"

"హిందీవాళ్ళు ఎంత శ్రద్ధచేస్తారక్కా—కళకోసం—"

"తెనుగువాళ్లూచేస్తారు—'పావలా' కోసం"

ఈసంభాషణా వేగంలో ఒక మళుపు తిరిగారు. ఒక యువకుడు సందేహిస్తూ వీరిని సమీపించి అన్నాడు.

"అబ్బ వెతగ్గా వెతగ్గా ఇక్కడ కనపడ్డారు" సరస్వతి హఠాత్తుగా ఆగి చూచింది.

"ఇదిగో—'జోసెఫ్' ఎన్నాళ్లకు! రాజమండ్రివచ్చి ఎన్నాళ్లయింది? ఏదైనా ఉద్యోగం దొరికిందా? మీరు క్రిస్మస్‌కు పంపిన కవరు అందింది. థాంక్స్—"

"నిన్న వచ్చాను ఇక్కడికి—మీపేరేగాని మీ అన్నగారి పేరు తెలియదు. ప్రయత్నించాను కనిపెట్టలేకపోయాను. రేపు మళ్లా ప్రయాణం. ఏమీతోచక సినీమాకు వచ్చాను. ఈ విధంగా మిమ్మల్ని చూచాను చాలా సంతోషం"

"ఇతను మా తమ్ముడు. పేరు శ్రీహరిరావు స్కూల్ ఫైనల్ చదువుతున్నాడు—తమ్ముడూ! ఈయన మన స్నేహితులు జోసెఫ్ బి. ఏ గారు. చాలా స్నేహపాత్రులు"

ఉభయులకూ పరిచయంచేసింది. జోసెఫ్ కొంతదూరం నడిచి తాను ఇంకోతోవంట వెళ్ళవలెనన్నాడు. శ్రీహరి గోదావరిగట్టున హాయిగా వెన్నెట్లో నడచివెళ్ళుదామన్నాడు. బయలుదేరారు. గోదావరిగాలి రివ్వున విసరుతోంది. కొంత దూరం నడిచాక హరి "అక్కా! ఇక్కడ నా క్లాస్ మేట్ ఒకడున్నాడు. పుస్తకాలు రెండు తెచ్చుకువస్తాను నడుస్తూ ఉండు" అని పక్కవీధిలోకి తప్పుకువెళ్లాడు. సరస్వతి జోసెఫ్‌తో ఏదో లోకాభిరామాయణం మాటాడుతోంది. అతడు మెల్లగావింటూ ఆమెతో నడుస్తున్నాడు. ఎరిగున్న ఆడవాళ్లూ మగవాళ్లూ ఇద్దరు ముగ్గురు వింతగాచూచి వెళ్లారు. వారు గుర్తించలేదు.

తాను వెళ్లవలసిన సందుదగ్గర జోసెఫ్ ఆగి కృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించి వెళ్లాడు. సరస్వతి సస్నేహంగా సెలవు పుచ్చుకొని ఇంటికి బయలుదేరింది.

"ఎవరది?"

"నేను అన్నయ్యా!"

"గుమ్మంలో కాలుపెట్టడానికి వీలులేదు"

"ఎందుచేత"

"సిగ్గులేదూ?"

"కాలేజీలో చేరగానే పోయింది—నీదయవల్ల—లేకపోతే ప్రతిమొగ శుంఠదగ్గరా తలవంచుకోవలసి ఉండేది. ఈ ఇంగ్లీషు చదువు రక్షించింది"

"ఆ వెధవ...ఏడీ?"

"ఇంకో పునిస్త్రీ దగ్గిరికి వెళ్లాడు"

"తెలిసిందిలే"

"ఏమిటి?"

"నా వంశం గంగలో కలిపావు—నా పేరు బుగ్గిచేశావు. నన్ను గుడ్డి వెధవనిచేస్తున్నావు—ఇక నడువు—"

"అన్నయ్యా మతిపోయిందా?"

"తలవంపులు"

"కాదు. లేదు. చాలా పొరబడుతున్నావు. ఇంతవరకూ నేనెట్టి అప్రతిష్ఠ కలిగించేపనీ చెయ్యలేదు. అదినీ గౌరవంకోసం కాదు. నా వ్యక్తి గౌరవంకోసం. మన సాంఘికాచారాలకు కొన్నిటికి నేను విరుద్ధంగా నడిస్తే నడిచిఉండవచ్చు. కాని అంతరాత్మ శుద్ధిగా ఎవరికీ లొంగలేదు. నా మాట నమ్ము" నిశ్చలంగా అంది.

"ఆడదాన్ని ఎవడునమ్ముమన్నాడు?" కళ్లారాచూచిన వాళ్లు చెప్పారు. నా ఇంట్లో ఉండతగవు. నీఇష్టంబచ్చిన చోటికి వెళ్లు. కావలిస్తే—నీడబ్బు నీకు పారేస్తాను. మరి నా గుమ్మం ఎక్కకు—" సీతారామయ్యగారు లేచి నించున్నారు ఒక నిశ్చయంతో.

"ఈ భవనం కట్టిన ఆయన నీ ఒక్కడికే తండ్రిగాడు. నాకూ తండ్రే. కాని ఈ దరిద్ర హిందూధర్మం మగజాతికి కొమ్ములు తొడిగి ఆడజాతిని అణగదొక్కింది. ఔను ఈభవనంనీది. నీ తండ్రి కట్టాడు. నాకు హక్కులేదు. నేను వెళుతున్నాను. ఇంతవరకూ అంతశ్శుద్ధిగా నేనెట్టిపాపం చెయ్యలేదు. ఇంక మూర్ఖమైన నీ మతాన్ని—ఆచారాన్ని ధిక్కరించి కసి తీర్చుకోవడంకోసం ఒక క్రైస్తవ మిత్రుణ్ణి పెళ్ళాడతాను. తలుపు వేసుకో"

వెళ్ళిపోయింది.

---

# ఆశ్రమవాసి.

మధుసూదనశర్మగారి 'నైమిశ' కుటీరం వూరికి మైలు దూరంలో వుంది.

ఊరిలోని శర్మగారి స్నేహితులైన వర్షీయాంసులూ—శిష్యప్రాయులైన నవయువకులూ మధ్యాహ్నం మూడు గంటలు—ఆప్రాంతానికి 'నైమిశం'లో చేరి అనేకవిషయాల మీద వేడివేడిచర్చలు సాగిస్తూ వుంటారు.

సాహిత్యం—సమాజం—కళ— వేదాన్తం ఒకటేమిటి సమస్తం ఆ చిన్నపెంకుటింటి పాలగచ్చుసావిడి తుంగచాపల మీద అలా అలా వికసించి గిరగిర తిరిగి ఎగిరిపోతుంటాయి.

సుమారు మూడు అవుతుంది. కొంచెంమబ్బు—చినుకుగా వుండడాన్ని ప్రస్తుతం 'నైమిశా' నికి అట్టే 'డిమాండు' లేకపోయినా—గోపాలంమాత్రం 'నైమిశం' ప్రశాంత హృదయాన్ని చెదరగొడుతూ అందుకున్నాడు.

"నేర్చుకుపోయారోయ్—మీరూ—మీ ప్రేమదాహాలూ—విరహ కావ్యాలూ—నీలిమబ్బులూనూ.

ఈరోజుల్లో ప్రతివాడూ—ప్రేమ తిని ప్రణయం తాగుతూన్నట్టు ఉపన్యాసాలు పేలగొట్టేవాడే—

నే నెరుగుదునుగా—ఏ శాంతాఆప్టేయో మాయాబెనర్జియో—పూలదండలతో కైదండలిస్తే శృంగార ఖంగారుతో అంగీకరించాలని మీ ముతావారి సంకల్పం—

చౌదరీ! ఒక్కటి చెబుతాను విను—పెద్దలు ఏర్పరచిన వివాహసంస్థ బహుదొడ్డది—పెండ్లి విషయంలో—చక్కని సాంప్రదాయం— చూసుకోవాలి గాని ఎందుకోయ్—ఈచదువుకొన్న చిత్రాంగులూ—ప్రేమ పెళ్ళిళ్లూ—ఆకతాయి వేషాలూ—అవకతవక ప్రవర్తనలూ......"

"అపర శంకరాచార్లుగారూ! అక్కడ ఆగండి—"

క్రిష్ణయ్యచౌదరి దెబ్బదిన్న తాచులా తిరగబడ్డాడు.

"గోపీ! నీచూపులో ఏదో గాఢమైన మాలిన్యం ప్రవేశించిందోయ్—లేకపోతే మధురమైన మానవహృదయాన్ని మృదులమైన స్త్రీజాతినీ—ఇంతచులకన చేసిమాట్లాడవు—వేదవిజ్ఞానాన్ని—ఉపనిషదాదార్శాన్ని—పోగొట్టుకొని,

నీచబుద్ధులతో పతితమైన బ్రాహ్మణజాతి 'అహం' అంతా నీలో పేరుకున్నట్టు కనబడుతోంది.

పవిత్రమైన వేదమంత్రాల కర్థం మరిచిపోయి—మేజువాణీలకూ—వియ్యాపురాలి లాంఛనాలకు తగువులాడిననాడే నీ వివాహసంస్థ శిథిలమైపోయింది. పిల్లల శ్రేయస్సు మరచి—'పెండ్లి' అంటే—వరవిక్రయం—కన్యాశుల్కాల వేలాం పాటగా మారిన వేళనే నీ పెద్దలూ—ఎద్దులూ—సమానం అని తేలింది.

ఈ విషమ సమస్యాకాలంలో—యువతీయువకులు—తమ విచక్షణ ఉపయోగించి తమ రుచులకూ—లక్ష్యాలకూ తగిన వారిని తామే చూసుకోక ఏంచేస్తారు?

నాతరం, నాకు వరప్రసాదముగా ఇచ్చే నవ్యజాగృతిని—ఆత్మవికాసాన్ని—వద్దని నేను కళ్లు మూసుకోలేను.

ఎన్ని విదేశకావ్య మాధుర్యాలు—ఎన్ని 'నవంనవ' శిల్పసౌందర్యాలు—ఎన్ని అభినవ దివ్యసందేశాలు—నన్ను కొత్తవెలుతురులోకి గెంటివేసినవో నువ్వుగ్రహించగలవా?—

మనిద్దరం బాల్యస్నేహితులమైనా— మానవజీవితంలో ప్రవేశించడంతోనే నీదోతోవా—నాదోతోవా—అయింది.

నీకు—సంఘం, లౌక్యం—ఉద్యోగం, పిల్లలు మర్యాద, వీటిచాటున భార్య ఒక ఉపకరణం. ఎంత మూర్ఖురాలైతే—అంతమంచిది—అప్పుడు సమాజంలో నువ్వు 'బాగుపడ్డ వాడవు'—

నాకు—నాజీవితవీణమీద సుఖశ్రుతిలో, ఒకతియ్యని పాటగా—కదలి నృత్యం చెయ్యగలిగిన సుహాసిని, సహవాసిని—కావలెనని కన్నుచింపుకొని వెదకుతున్నాను. కాని నీవలె హృదయంలేని, రంగు 'సెల్యులాయిడ్' బొమ్మలను చూచి భ్రమపడుతున్నా ననుకోకు—

నాహృదయానన్నంతటినీ ప్రేమమయంచేసి—నాపూజా మందిరంలో—హృదయాధి దేవత—మంగళమయి—అయిన శ్రీమధుమూర్తిని పూజచేస్తాను, గాని నీవలె సంఘంఇచ్చిన కొయ్యబొమ్మను చచ్చినా ప్రేమించలేను—

శరత్కాలపు వెన్నెల్లో మిలమిల మెరిసే లేతచిగుళ్లవంటి నాప్రియురాలి ఎర్రని పెదవులు—చెంపలమీదనుంచి మెడ వంపులోకి ప్రవహించే ఆమెలావణ్యకాంతి—కంటె నాకింకో ఉపాస్య దేవతలేదు. వట్టి శాక్తేయమతస్థుణ్ణి, 'స్త్రీతి నామాపి మధురమ్' అన్న ముసలివాడు ఎంత బుద్ధిమంతుడోయ్—

ఈ బలవన్నిశ్చయంలో—నాకు నువ్వూ—నీసమాజమూ...

"బాలతృణవత్—ఔనా?" శర్మగారు లోపలనుంచి నవ్వుతూ వచ్చి నిలుచున్నారు. చౌదరి చలాకీగా "మా గరం గరమ్ ప్రసంగాన్ని నాటకంగా మార్చి ఖుషీగా రక్తికట్టించిన తమ సన్నిధి మాకు ప్రసాదించాలి" అన్నాడు.

"మావాదానికి మాధ్యస్థ్యం వహించి న్యాయంఇప్పిచాలి—ఇలాదయచెయ్యండి" అన్నాడు ఆహ్వానిస్తూ గోపాలం.

## 2

మధుసూదనశర్మగారు వెనక విజయనగర ప్రాంతంలో వున్న ఒక కళింగ జమీందారీలో తాణేదారుపనిచేసి, అంపపుకోతల వంటి సంసారభాగాలను అనుభవించి—జీవితంలోని చేదుపానీయాల నన్నిటినీ చవిచూచి, విసిగి—పింఛను పుచ్చుకున్నారు. వూరికిదూరంగా వున్న తమ మామిడితోటలో 'నైమిశ' మనే పేరుతో ఒక పెంకుటిల్లు వేసుకుని అందులో ముసలి భార్యా తానూ ప్రస్తుతం నిశ్చలమైన వానప్రస్థాశ్రమాన్ని నడుపుతున్నారాయన.

బ్రహ్మసూత్రములను—గీతాభాష్యమును—దశోపనిషత్తులను—వివేకానందాదుల దివ్యసందేశాలను—శోరచి చదివి లోతులు గ్రహించి ఆచరణకు దెచ్చిన పక్వహృదయుడు.

దూరానికి ఆరముగ్గిన బౌద్ధసన్యాసిలా కనపడతారు.

వృద్ధులతోనూ—యువకులతోనూ సాయిలాఫాయిలాగా మాట్లాడి అందరినీ రంజించే ప్రేమమూర్తి.

ఏవిషయాన్నైనా ఎత్తుకుని వివేకంతో చర్చచేస్తూ వుంటే వేదకాలపు ఋషుల ఔదార్యం జ్ఞాపకంవస్తుంది.

## 3

శర్మగారు గంభీరములైన తన కళ్లనెత్తి మానవజీవితాల వెనుక ఉండే ఏ నిగూఢ రహస్యాలనో చూస్తూ—'ఈ పత్' నవ్వి ఇట్లా వారిప్రసంగంలో పాలుకొన్నారు.

"నాయనా, వేడిపాలవలె పొంగులువారే పడుచు హృదయాలలోని—తీవ్రవాసనలనూ—ఆత్మాభిమానాలను...అర్థం చేసుకోగలను. కాని—

ప్రపంచంలో నిరంతరమూ ఎగిరే—అసూయా—ద్వేష—స్వార్థ ధూళులు మీహృదయాలలోని నిర్మలత్వాన్ని మాపి—కుటిలములుగా చేస్తున్నాయి. ఫలితంగా కొందరు వట్టి మితవాదులూ—కొందరు శుష్క అతివాదులూ—అవుతున్నారు.

ఒకవైపు చూస్తే—వేదర్షులు స్వచ్ఛహృదయాలతో ఏర్పరచిన వివాహమంగళవిధి బుద్ధిహీనశ్రోత్రియులవల్ల ఖిలమైపోయింది. మడిబట్టలూ—దేవతార్చన పెట్టెలూ దొంగస్నానాలూ—చాటునజరిగే ఘోరాలకు అంతు లేదు.

రెండవప్రక్కను చూస్తే—పరదేశ నాగరికతా ప్రభావాలవల్ల—ప్రేమకూ మోహానికీ భేదం తెలియని అజ్ఞానులు ప్రబలి పోతున్నారు.

బుద్ధిమంతుడు అందని తీవ్రకాంక్షలకోసం ఆత్మవినాశాన్ని చేసుకోక జీవితాన్ని నిగ్రహంతో బిగబట్టి ఎన్నో ఉత్కృష్ట కార్యాలకు వినియోగించి వేస్తాడు.

నాయనా, ఈ జీవయాత్రలో—ఎన్ని ఆశాభంగాలు—ఎన్ని కాల్చే ప్రతీక్షలు—ఎన్ని అశాంతులు—

ప్రేమ ముందు శతిస్తుంది—ఏడిపిస్తుంది—తహతహా పడిన కొద్దీ దూరంగా జరిగిపోతుంది. ఒకనాడు హఠాత్తుగా ఎదురు

చూడని త్రోవవెంట వచ్చి నీ భుజంమీద చెయ్యి వేస్తుంది.

ఇప్పుడు నే నీ అరవై ఏండ్ల వృద్ధశరీరంలోనుంచి నాపడుచు ప్రాయపు పొలిమేరల్లో ప్రవేశిస్తే ఆనాటి హృదయస్పందనన్ని వేశాలు కొన్ని జ్ఞాపకం వస్తున్నాయి."

పాపం, ఆవృద్ధుని ముడతలుపడ్డ కళ్ళనుంచి రెండు మంచి ముత్యాలు జారి చెక్కిళ్ళమీద కరిగిపోయాయి.

శర్మగారు గొంతుసవరించుకుని చెప్పడం మొదలుపెట్టారు.

## 4

నేను విజయనగరం కాలేజీలో చదువు కొంటూండగా—ఎవరోమాకు దూరబంధువులు—జగన్నాథయాత్రకు వెడుతూ—ఒకసారి మాకుటుంబాన్ని చూచి వెళ్ళవలెనని దిగి మా యింటికి వచ్చారు. అప్పుడు నాకు పద్ధెనిమిదీ—ఇరవై ఏళ్లు వుండవచ్చు.

మా నాయనగారు వారిని చాలా ఆదరించి ఒక్క వారం రోజులు బలవంతంమీద మా ఇంట్లో ఆపివేశారు.

వచ్చినవారిలో పదిహేనేండ్ల ఒక అమ్మాయికూడా వుంది. ఆమె మా యింట్లో ప్రవేశించింది మొదలు అందరితో చనువుగా—నవ్వుతూ పాడుతూ గాలికన్న తొందరగా—లేడికన్న అందంగా మసలడం ప్రారంభించింది.

ఎవ్వరితోనూ కొత్తలేదు—నవ్వులబండి—పువ్వులగుత్తి.

ఒకనాడునేను నా 'స్టడీరూమ్'లో కూచుని ఏదో 'నోట్సు' వ్రాసుకుంటూ వుండగా—ఆమె ఓరగా మూసివున్న నాగది తలుపు తోసుకు వచ్చి—చట్టున నన్ను చూచి సిగ్గుతో తిరిగి పోతూ—'దొరగారి ఆఫీసుగాబోలు' (నేను ఖర్మంచాలక 'సూటు' తో వున్నాను) అంటూ గొణుక్కొని నవ్వుతూ గదిగుమ్మం దాటుతూ వుండగా—వాళ్లతో వచ్చిన ఒక ముసలావిడ చూచి "సీతా, ఏమిటా వెకవెక? నీబతుక్కి సాయం—తల తగలేయించరా అంటే నీతండ్రివినడు...అనుభ విస్తాడులే" రుంజుకుని వెళ్లింది.

నేను అప్పారావుపంతులుగారి శిష్యుణ్ణి. ఆగురుదేవుడిచ్చిన కొత్తకళ్లతో అప్పుడే ప్రపంచాన్ని చూడడం ప్రారంభించిన వాణ్ణి.

వెంటనే ఆ మాటలు నా కపాలాన్ని బద్దలుకొట్టి—మెదటిలో గుచ్చుకున్నాయి. పక్కగదిలో వెక్కి వెక్కి ఏడుస్తూన్న మూలుగు వినపడింది.

నే నంతవరకూ—దురదృష్టదేవత జడలోని ఆ సుందర పుష్పాన్ని తేరిచూడనే లేదు.

అప్పు డామెను హృదయంలోకి తీసుకొని ఆదరించవలెనని ఎంతో తపించాను—మర్నాడు వారు బయలుదేరి వెళ్లి పోయారు. ప్రయాణసమయంలో సీత అందరితోనూ చెప్పి బండి ఎక్కుతూ నీలిగోరింటపూలవంటి కళ్ళనెత్తి ఒక్కసారి నావైపు చూచి ముఖం అటు తిప్పుకుని వెళ్లిపోయింది.

నాగదిలో—మా గురుదేవుడు పలికిన 'ప్రేమకలుగక బ్రతుకు చీకటి' అనే వాక్యం కాళ్లు వచ్చి పచారు చెయ్యడం మొదలెట్టింది.

ఇది దుర్లభజనానురాగమనీ—ఈ జన్మ మధ్యంలో ఇంక సీత నాకు కనపడదనీ గ్రహించలేనంత మూర్ఖుణ్ణి గాను—కాని యువకహృదయాలను నులిచి తనవైపు లాక్కునే ఏదో ప్రబలశక్తినన్ను ఉన్మత్తుణ్ణి చేసింది.

తర్వాత కొన్నాళ్లకు నాకు పెండ్లీ—అయింది, పిల్లలూ—పుట్టారు. సంసార చక్రంలో తలవంచుకొని పరిభ్రమించడమూ మొదలు పెట్టాను. కాని—

ఆ సీత కోమలవిగ్రహం మాత్రం చాల రోజులవరకూ నాకళ్ల లోంచి జారిపోలేదు.

జీవిత—గాయాల నన్నింటినీ కాలమే మాన్పివెయ్యగలదు.

క్రమంగా నా నేత్రాలలోని సువర్ణస్వప్నాలూ—నా మనస్సు లోతులలోని తియ్యని కోరికలూ—మాసిపోయాయి.

ఒక ఇంటివాడనై ఉద్యోగంచేస్తూ 'నిశ్చింత'గా కాలం గడిపివేస్తున్నాను. మరికొన్నాళ్లకు ఇంకోచిత్రమైన అనుభవం.

## 5

ఒకసారి నా ఉద్యోగపు హయాంరోజుల్లో కొన్ని ముఖ్యమైన జమీందారీ వ్యవహారాలు పరిష్కరించుకోవడంకోసం

ఒక పల్లెటూరు 'కమాను' వెళ్లాను. అక్కడ కొన్నాళ్లు మకాం చెయ్యవలసివచ్చింది.

గ్రామ—పెద్దలు, నాకు—వూరికిపక్కగావున్న ఎలిమెంటరీ స్కూల్లో బస ఏర్పాటు చేశారు.

జనసంచారం తక్కువ—చుట్టూ రకరకాల చెట్లు—పూల మొక్కలు—చక్కని గాలి—నా వ్యవహారాలు చక్కబెట్టు కోడానికి బహు సదుపాయంగా వుంది.

అక్కడ సుమారు నెలరోజులున్నాను. నా పనికూడ సల క్షణంగా పూర్తి అయింది. తెల్లవారితే స్వగ్రామం వెళ్లిపో డానికి ప్రయాణం పెట్టుకున్నాను.

పల్లెటూరి రైతుస్నేహితులు రాత్రి చాలావరకూ నాతో గడిపి, అంతా దండాలుపెట్టి వెళ్లిపోయారు. పన్నెండు గంటలు దాటుతుంది. కృష్యమానపు వెన్నెల పుచ్చపువ్వులా వికసించి గ్రామసీమనంతటినీ వెలిగిస్తోంది.

నేను అప్పుడే గదిలోకి వెళ్లి పండుకున్నాను. బంట్రోతు వరెండాలో పాత ఈతచాపమీద ఒరిగి అట్టేసేపు కాలేదు.

పెరట్లో మామిడిచెట్లకింద పండుటాకులమీద పడుతూన్న ఏదో అడుగుల చప్పుడు పూర్తిగా నిద్రపోని నా చెవులకు తగిలింది. ఐదు నిమిషాలు గడిచాయి.

వరెండాలో ఏదో సన్నంగా తగ్గించిన గొంతులు వినపడు తున్నాయి.

బంట్రోతు మెల్లగా నాగదిలోకి వచ్చి వణుకుమాటలతో

"బాబూ—యెవరో అమ్మ మీతో—మాటాడవలసిన...
తొందరపని... వుందట— అరుగుమీద వుండమన్నాను...
సెలవైతే..."

"వద్దు—వెళ్లు—నేనే వస్తు...న్నాను." నా తలలోంచి మెదడు జారిపోయి ఆచోట ఆశ్చర్యం నిండిపోతోంది.

నేను తూలుతూ వెళ్లాను—ఆమె నన్ను చూచి మెల్లగా అరుగుపక్కనుంచి పెరట్లోకి నడుస్తోంది సాభిప్రాయంగా—

తలలోని మల్లెచెండు నడిచేత్రోవను సువాసనతో నింపు తోంది—

స్త్రీజాతి మృదు హృదయాన్ని తిరస్కరించలేని దౌర్బల్యం వల్ల అనాలోచితం గానే ఆమెను అనుసరించాను.

వెళ్లి వెళ్లి ఒక మామిడి చెట్టుదగ్గిర తలవంచుకొని నిలుచుంది. నేను సమీపించాను.

"అమ్మాయీ, యెవరు నీవు? ఇంతరాత్రివేళ నాతో ఏమి...పని వుంది?—"

ఆమెను స్పష్టంగా చూచాను స్వచ్ఛమయిన దంతపుబొమ్మ వంటి—శరీరం—తెల్లనిచీర— వెన్నెలకాంతిలోని ఆమె ముఖం నిర్మలమనస్సులో తెల్లగలువలా మెరుస్తోంది.

నా తలలో తుఫాను పట్టింది.

ఆ నవనీతమతి మాటలాడలేకపోయింది.

"చెప్పదగినంత పని ఏమీ లేకపోతే... నేను వెళ్లవచ్చు ననుకుంటాను" అతి కుతుకంతో బాధపడుతూనే.

"... ఈ సాహసానికి...మన్నించండి—ఈ రాత్రి...ఇలా వచ్చినందుకు...నన్ను నీచంగా యెంచితే ప్రాణాలు వదిలించుకోవడంకన్న ఏమీ చెయ్యలేను." పాపం అభిమానంతో కుంగిపోయింది.

"ఫర్వాలేదు—అట్లా దిగులుపడడం దేనికి? నాతో నిర్భయంగా మాటాడవచ్చు" కొంచెం ఊపిరిపోశాను.

ఆమె తేరుకుంది—

"నే నొక గొప్పయింటి విశ్వబ్రాహ్మణుల కుటుంబానికి చెందినదాన్ని. తాతతండ్రులు బాగా చదువుకొన్నవారు. ఏం లాభం—కలిసిన సంబంధమని ఒకనిర్భాగ్యుడికి నన్ను చేశారు. అతడు దుస్పహవానాలు మరిగి దేశాంతరాల పాలయిపోయాడు.

ఉన్నదీ లేనిదీ నేటివరకూ తెలియదు. నాబతుగు మంటగలిసి పోయింది. మావాళ్లకు చాకిరీచేస్తూ—తోచనప్పుడు ఏవో పుస్తకాలు చదువుకుంటూ ఇక్కడే పడివున్నాను.

ఈమధ్య ఎన్నోసార్లు మిమ్మల్ని చూశాను. మూర్ఛపోయిన నా కోరికలూ—ఆశలూ ఏవేవో మేలుకున్నట్టయింది.

మీ ప్రసన్నమైన ముఖం—చక్కని కళ్లూ—మీకు తెలియకుండానే నన్ను ఆకర్షించి వేశాయి. కులం—మర్యాద—కీర్తి కోసం ఎంతో గిలగిల కొట్టుకున్నాను. లాభంలేక పోయింది. పండువెన్నెల— నిండుయౌవనం— మీపాదాలదగ్గిరకు వచ్చిపడింది—అనుగ్రహించలేరూ?" శ్రావణరాత్రిలో నీటి

మేఘంచాటునుంచి ఒక్క వెన్నెల రేకలా నీళ్లునిండిన కళ్లలోంచి నన్నంగా నవ్వి సిగ్గుతో తలవంచుకుంది—

ఆ శుభయామినిలో నా తను వొక్కసారి పులకరిల్లిపోయింది.

ఎన్ని అనంతతపస్సులకు—దురంత వేదనలకు—అనురాగ నిష్ఠలకు—సుదూర సుఖస్వప్నాలకూ ఫలితంగా—ఈ కమ్మని రాత్రి—ఈ అప్సరసౌందర్యం నాకు ఏ దేవతా వరప్రసాదంగా-సిద్ధించిందో వూహించుకోలేక పోయాను. కాని... నా నోటి వెంట అప్రయత్నంగా ఈ మాటలు వచ్చాయి.

నీ వంటి ఉషస్సుందరి నన్ను మనఃపూర్తిగా ప్రేమించిందంటే నా ధన్యత్వం ఎంతని చెప్పగలను? నా ముప్పదేండ్ల బ్రతుకులోనూ ఇంతటి పర్వసమయం సంభవించలేదు. నిజం. కాని—పూర్వమే భార్యా పిల్లలూ—సంఘం—మర్యాద—వీటిచేత 'మాంసపు జైలు' లో బంధింపబడ్డ ఖైదీని నేను.

ఇంత అస్వాతంత్ర్యపతితుడను నిన్ను ఎట్లా కన్నుల కద్దుకొని ఆదరించగలను?

ఈ చక్కని వేళలో—మత్తులో—హాయిలో నీసౌందర్యాన్ని—యౌవనాన్ని—కన్నులుమూసుకొని అనుభవించి నా త్రోవవెంట నేను పోతే భవిష్యత్తులో—నీవు పడే నరకాగ్ని బాధను వూహించుకొని జాలితో కుంగిపోతున్నాను.

పురుషులు వట్టి వంచకులు—స్వార్థపరులు—ఎవ్వరినీ నమ్మకు—వెళ్లు—వెళ్ళిపో—నీవశమైతే—నన్ను దూరంగానే ప్రేమించు—పిచ్చిదానా! ప్రేమకు భౌతికస్పర్శ లక్కర

లేదు. ఏ సుఖస్మృతిలోనైనా నిన్ను నేను తృప్తిగా తలచుకో గలనుసుమా...

తిరిగి చూడకుండా నా బసలోకి నడిచిపోయాను.

మల్లా చెట్లకింద పండుటాకుల్లో—విసురైన అడుగుల చప్పుడులోనుంచి 'ఛీ—మగవాళ్ళు ఎంతరాళ్ళు—' అన్న మాటలు గాలిలో తేలివచ్చాయి.

వెంటనే బంట్రోతును సామాను సర్దమని చెప్పి తెల్లవారు జామునే ప్రయాణం సాగించాను"

వెచ్చని పొడుగైన నిట్టూర్పుతో శర్మగారన్నారు—

"నాయనా, జీవితాన్ని అనుభవపక్వంచేసి సత్యాన్ని గ్రహించండి—క్షుద్ర ప్రపంచవాసనలకు లొంగక—తపస్సు చేసి ఉత్తమలక్ష్యాలను సాధించండి—ఇప్పటికే చాలాప్రొద్దు పోయింది. మాటమీద మాటగా ప్రసంగం పెరిగింది— ఇంక లేవండి—రేపు కలుసుకుందాం" శర్మగారు లోపలికి వెళ్ళి పోయారు.

'నైమిశం' మెట్లు దిగుతూ క్రిష్ణయ్య గోపాలం బుజం తట్టి "ఆతి డనేకయుద్ధముల ఆరియు తేరిన వృద్ధమూర్తి" భైరవిలో సన్నంగా అందుకున్నాడు.



# శర్వాణి

"దవానం—చామంతీపూలూ."

గ్రాండు ట్రంక్ ఎక్స్‌ప్రెస్ రైయియిమనివచ్చి, ఒంగోలు స్టేషనులో ఆగింది.

చిత్రమైన రైల్వే యాసతో చెవులు గింగురుమనేలా ఒక డందుకున్నాడు.

ఒకమూల హోల్డాలు నానుకొని ఒక యువకుడు భగవద్గీత చదువుకుంటున్నాడు.

"ధ్యాయతో విషయాన్ పుంసః
సంగ స్తేషూపజాయతే
సంగా త్సంజాయతే..."

"దవనాం—చామాంతి పూలు"

పూలవాడు దగ్గరగా బిగ్గరగా అరుస్తున్నాడు.

జనార్దనశర్మకు వాడి గొంతుపిసిగి ఆకేక ఆపుచెయ్యా లనిపించింది.

కాని—

వాడి పూలజంగిడిలోని చల్లని దవనంవాసన విరక్తికి అంకితం చేయబడ్డ శర్మ హృదయాన్ని కూడ మెత్తబరుస్తోంది. శర్మ ఎందుకో కొంచెం నవ్వి, గీత తరువాతిభాగం అందుకున్నాడు. ప్రాణాలు తోడే రైలుప్రయాణంతో వెన్నెముక లాగుతోంది. కాస్త 'టీ' స్టేషనులో పుచ్చుకువస్తే బాగుండును—

నవ్వాడు—ఈమాత్రం నిగ్రహంలేనివాడు ఏం సాధించ గలడు! అతని పచ్చని లేతముఖంలో గంభీరమైన నిష్ఠ ఏదో పచారు చేస్తోంది.

ఏకాగ్రంగా గీత చదువుకుంటున్నాడు.

"ఏయ్ చామంతిపూలు!—అట్లా ఆకిటికీదగ్గరకు గా—పరిమళించే చిన్న పువ్వులు లేవూ"

ఎవరైనా దగ్గరగా తెచ్చి వీణ వాయిస్తున్నారా? "అరదము దేహ, మింద్రియము లశ్వములు—" వినగల పక్వ హృదయుడికి దేనిలోనుంచి ఐనా ఎంత మధురగానం వినపడుతుంది!—

"అబ్బాయీ, మరువంలేదూ?"

—పిలుపు కిటికీదగ్గరకు వచ్చింది.

చుట్టూ ఉన్న గాలి గులాబీవాసనతో నిండిపోయింది.

భగవద్గీతలోని ఒక్కొక్క-శ్లోకం ఒక్కొక్క గులాబీచెట్టు. అక్షరాలన్నీ చరచర పువ్వుల్లా వికసిస్తున్నాయి. గులాబీ ఆకులన్నీ మరువంవాసనతో గుప్పు మంటున్నాయి!

నికరమైన పరమపవిత్ర ప్రాచీన సంస్కృత వాక్యాల్లో—ఈ మధుర కంఠాలు—మరువం, గులాబీల పరిమళాలు కన పడగూడదని ఏ ఉపనిషత్తూ, గుర్వాశీర్వచనం శాసించలేదా?

దవనంజడలకూ, సిల్కు-జాకెట్లకూ, వీణాకంఠాలకూ, రంగు రంగుల చీరలకూ, కొత్తగాజుల గలంగలలకూ ఉలికిపడక పోవడం ఏ పదేళ్లనుంచో నిశితంగా అభ్యసించిన ఈ తపస్వి పాలిటికి ఏ దుర్మార్గపు ఇంద్రుడైనా పూర్వశిని పంపాడా?

పిలుపు జడలో గులాబిపూలు—శర్మహృదయంలో వింత వింత జ్ఞాపకాలుగా పొడిచాయి.

అప్రయత్నంగా భగవద్గీత ముడిచి తల ఎత్తి చూచాడు.

గోపీచందనరంగు సిల్కుచీర, ఆకుపచ్చని బ్లౌజు, లేతకలువ పూరంగు శరీరం—

గుప్పెడు దవనం, మరువం, చామంతిపూలుకొని జడనిండా పెట్టుకొని కళాజీవి సుఖమయ స్వప్నంలా వెళ్లిపోతున్నది.

జనార్దనశర్మ తన కళ్ళను నమ్మలేక కళ్ళు చిట్లించి మళ్లా చూశాడు. నీళ్లు కమ్మేకళ్లను తుడుచుకొని తేరి చూచాడు.

"ఏదేవతలు అనుగ్రహించి ఇచ్చిన వరదానమిది? ఏకఠోర తపస్సుకు ప్రత్యక్షఫలం? నా మరపుల్లో—కన్నీళ్ళలో—నిరాశలో—విసువులో—విరక్తిలో తుడిచిపారవేసిన దేవతా మూర్తి—శర్వాణికి ఎవరు ప్రాణమిచ్చి, నాయెదుట కదుపుతున్నారు!"

నా ప్రాణ కుసుమాలన్నిటితోనూ పూజించిన మెడవంపు కాదూ అది—నాజీవన మాధుర్యమంతా ఖర్చు పెట్టి నవ్వించిన పెదవులు కావూ అవి—ఆ నిగనిగల ఇంద్రనీలపు వలయాల వాలుజడదర్శనంకోసం ఎన్నాళ్ళు మేల్కొనితపించాను!

కాంతులు పుక్కిలించే ఆసన్నని నున్నని వేళ్ళను అర్చించడంకోసం ఎన్ని చక్కని పదాలు ఏర్చి పద్యాలు కూర్చాను!

రైలు కంయిమని కూసి కదలబోతున్నది.

"వాణీ—ఇదిగో—ఫ్లాస్కు—అందుకో"

బొంగురువంటి గొంతు ఒకటి ఆమెను పలకరించింది. శర్వాణి కిటికీలోనుంచి 'టీ' అందుకొని ఒకగ్లాసులో పోసింది. ఒక నల్లదొర నూటుతో వచ్చి ఆమె ప్రక్కను కూర్చున్నాడు. నోట్లో రూళ్లకర్రవంటి హవానాచుట్ట. మధ్యమధ్య తీసి ఇంగ్లీషు మాట్లాడుతున్నాడు (చంటిపిల్లలతో కూడా)—

అప్పరస పక్కను ఈ దైతేయుణ్ణి చూచి, పరిగెత్తే రైలు కిందకు దూకితే మంచిదికాదా అనుకున్నాడు శర్మ. ఆ వికారంతో శర్మ మనస్సు తునియలై, నిశ్చింతగా ఆ మగనితో గడిపే శర్వాణిని ఊహించుకొని స్త్రీజాతిని—లావణ్యాన్ని— ద్వేషించడం మొదలు పెట్టింది.

శర్వాణి గ్లాసులో పోసిన 'టీ' పెదవులదగ్గర పెట్టుకోడానికి తలయెత్తి జనార్దనశర్మను చూచింది. గ్లాసు కింద పెట్టి రెప్ప వాల్చకుండా శర్మను చూస్తోంది.

ఏ తియ్యని జ్ఞాపకాలో ఆమె మనస్సును పొడిచి బాధిస్తున్నట్టు ఆమె చూపుల్లో అశాంతి చెబుతూన్నది. రెండు నిముషాలు వూపిరాగేలా చూసి శర్మకు నూటిగా నవ్వింది.

దేనినో ఆలోచిస్తూ తల వంచుకొన్న శర్మ తలయెత్తి శర్వాణివంక చూచాడు. ఆమె ఇటుప్రక్క చూడలేదు. ఖులాసాగా మగనితో ఏదో మాటలాడుతోంది.

ఆ కళ్లలో ఎంత కొంటెతనం—ఆ పెదవుల్లో ఎంత బింకం— ఆ గుండెలో ఎంత స్నేహం వున్నదో అతనికి తెలుసు.

తన హృదయవేదనతో గుడ్లు పగిలేలా ఒక్కసారి వాణి

వంక చూచి 'నారీ స్తనభరనాభీదేశం దృష్ట్వామాగా మోహా వేశమ్' అన్న ఆచార్య వచనావృత్తిలో సామాను సర్దుకున్నాడు.

తరువాతి స్టేషనులో బండి ఆగింది. దిగి మరొక పెట్టెలోకి ఎక్కాడు.

## 2

గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ హోరుపెడుతూ పరుగెత్తుతూన్నది.

జనార్దనశర్మ హృదయం అంతకన్న మహా వేగంగా—కాలాన్ని, దేశాన్ని కబళించి పరుగెత్తుతోంది.

అతడు ఒకచోట సర్దుకుని, కిటికీలో తల పెట్టి శూన్యంగా బైటికి చూచాడు. ఎగిరే ధూళీ, రాక్షసి బొగ్గురవ్వలూ తప్ప ఏమీ కనపడడం లేదు. చుట్టూ మనుష్యులున్నారు. మాట్లాడుకుంటున్నారు. ఏమీ వినపడడం లేదు. తలనెప్పిగా ఉన్నది. మామూలు 'టీ' తాగకపోవడంచేత గాబోలు! కాని అంతట్లోకే శరీరంలో అంత వికృతి పుట్టనవసరంలేదు.—తలచించుకొన్నా తోచడంలేదు. మనస్సులోని ఆవేగం ఇంకా చల్లారలేదు. మస్తిష్క ప్రపంచమంతటా ఇసకతుఫానులా శర్వాణిసౌందర్యం రేగిరేగి ఆక్రమించింది.

పెదవిదగ్గర మధుపాత్ర జారవిడుచుకొన్న వాడివలె, కళ్లలోని సువర్ణసుందరస్వప్నాన్ని తుత్తునియలు చేసుకొన్న వాడి

వలె జనార్దనశర్మ శూన్య హృదయంతో ఎదుట కిటికీలోంచి సుదూరంలో కనపడే భూమ్యాకాశాలు కలిసే చోటు చూస్తున్నాడు.

ఒకమహా ప్రేమికుడు తన ప్రియురాలి దగ్గరగా వెళ్ళి పెదవులమీద గాఢంగా ముద్దుపెట్టుకుంటూన్నట్టు తోచి ఈర్ష్యగా—వ్యథగా తల తిప్పుకొన్నాడు.

ఈ ఆడపిల్లలు— శరీరలావణ్యాలు — ప్రేమదాహం — ఎన్నాళ్ళు నన్నిట్లా వేటాడుతాయో! పదేళ్ళకిందట పుస్తకాలూ, చదువూ, స్కూలూ తప్ప రెండవదిక్కు చూడని నా జీవితంలోకి తొలిసారి అమాయకపు నీలికళ్ళతో, పట్టుపరికిణీతో పక్కింటివారి గారాబుబిడ్డ శర్వాణి ప్రవేశించింది. క్రమంగా మెరుపెక్కి మధురంగా, బరువుగా వాలే ఆచూపులూ, గోరింటపూల నున్నని లేతఎరుపుతో సిగనిగలాడే ఆ కొంటెనవ్వు పెదవులూ నన్ను శిక్షించి ఏవో తియ్యని ఊహల్లో తిప్పడం మొదలు పెట్టాయి గదూ! కలసి చదువులు—కమ్మని కథలు—పెరళ్లు—నవ్వులు—పువ్వులు—అచ్చంగా మల్లెపూవులు—వెన్నెల గోష్ఠులు—కోపాలు—శపథాలు—అనుగ్రహాలు—హాస్యాలు—పిచ్చి, పిచ్చి, అంతా వట్టిభ్రమ. ఏదీ శాశ్వతం కాదు. ఏమాధుర్యం, ఏపరిమళం, ఏకాంతి కళిక స్థిరంగా నిలిచింది!

ఒకనాటి ఉదయము కొత్తచీరలో తొణికే యౌవన శోభతో, శర్వాణి తల ఒంచుకుని తిరిగి చూడకుండా వెళ్ళి

పోయింది—ఎక్కడికో—

వసంతశోభ, శరత్కాలకౌముది— ఎప్పటికైనా తిరిగి వస్తాయి. శర్వాణిమాత్రం మళ్లా కనపడలేదు.

నిశ్చింతగా నా జీవితము గడిచిపోతోంది—అనుకున్నాను—కాని—శాంతికి నోచుకోలేదు మనస్సు. కళాశీలి హృదయానికి అశాంతి వరప్రసాదమేమో!

కొంత కాలానికి నా జీవిత యాత్రలో భవాని ఎదురుపడి తన చమత్కార వాక్కులతో—జానకి దీనాతి దీనములైన ఆకలిచూపులతో— శారద ఒక్కొక్క మధురభంగిమతో నన్నెంత ఏడిపించారు?

నాటికి నేను మళ్లా శర్వాణి మానసికపరిధుల్లో తుఫాను లేవదీసింది.

నిశ్చయం—ఏదీ శాశ్వతం గాదు.

స్త్రీ లావణ్యాలకంటె—సీతాకోకచిలకలకంటె, వర్షాకాలపు ఇంద్రధనుస్సుందరదృశ్యాలకంటె, ప్రభాత ప్రశాంతనదీగర్భం మీదనుంచి లేచి చెంగున నృత్యానికిదుమికే ఉషస్సౌందర్యం కంటె, చిన్నపిల్లల నున్నని బుగ్గలకంటె, వీణాసంగీతంకంటె అతీతమైన సౌందర్యం ఎక్కడుందో వెదకిపట్టుకోవాలి.

స్వర్గీయ పారిజాతప్రసూనమాలవలె ఎప్పటికీ వాడనిదీ—వీడనిదీ—

ఎవ ఉపరీక్ష నన్ను?

"ఇక ఏ సౌందర్యలవంకోసమూ తపించను— ఏ వీణాగళానికీ

కలవరపడకూడదు—ఏ మెరుగుచెంపలనూ కన్నెత్తి చూడను—పరమ ప్రాప్యం దేనినో సాధించాలి" అని ఒక నిశ్చయానికి జీవితాన్ని తిప్పబోయేసరికి ఎవడో ఇంద్రజాలికుడిలా విసరడం, ఒక అప్సరస ఇట్టే పుట్టి నన్ను వేటచెయ్యడం—ఏమిటిది ?

బెజవాడ స్టేషనులో గట్టిగా కూసి ఎక్స్‌ప్రెస్ ఆగింది.

చెయ్యవలసిన ప్రయాణం చాలా ఉన్నది. శరీరం చాలా అలసివున్నది. ఇక్కడ ఒకరోజు విశ్రమించి వెళ్లడం మంచిదని నిశ్చయించాడు.

దిగి జట్కాలో ఒక హోటలుకు వెళ్లి మేడమీద ఒక గదిలో బస ఏర్పరచుకున్నాడు.

మేడ విశాలంగా, అందంగా వుంది. చాలా గదులున్నాయి. భాగ్యవంతులు బస చేయదగిన హోటలు. డాబా ఎక్కిచూస్తే నల్లగా పాకులుపాయలుగా ప్రియురాలి వేణీభరంలా కృష్ణానది కనిపిస్తుంది.

# 3

రాత్రి సుమారు ౧౦ గంట లవుతుంది. కృష్ణానది మీద నుంచి హాయిగా గాలి వస్తూంది. లైటు వేసి తన గదిలో పడకకుర్చీమీద కూర్చుని నీలకంఠ దీక్షితుని వైరాగ్యశతకం చదువుతున్నాడు శర్మ.

"తృణవ ద్భ్రమంతి చపలాః
స్త్రీగామని చండమారుతే చలితే..."

కళ్లు నొప్పులు పెడుతున్నాయి. ఆవలింతలు.—

"ధరణిధరా ఇవ సంత
స్తత్ర సకించి త్ర్వేకంపంతే"

పకపక నవ్వుతూ "మహానుభావుడు అద్భుతంగా చెప్పాడు."—జనార్దనశర్మ ఈ మాట గట్టిగా పైకే అని మరిఒకటి చదువుతున్నాడు.

పకపక ఎదురుగుండా నవ్వు. తలుపు సన్నంగా తోసుకు వచ్చి—

తల ఎత్తి చూచాడు. 'శర్వాణి!'

లేత మబ్బురంగు ఉప్పాడ చీర— పొట్టి చేతుల జాకెట్— జడనిండా మల్లెపూలు! ఘుమఘుమ పరిమళించే తాంబూలం నములుతూ దగ్గరగా ఒస్తోంది.

శర్మ ఖంగారుగా లేచి నించుని— "వాణీ...ను...వ్వో...ట్లా...కృష్ణ చల్లని గాలిలోంచి పూల సువాసనలా కొట్టు కొచ్చావా?...నేను కల గనడంలేదుగదా?...డాబా పగల గొట్టుకుని పైనించిదూకావా?"

"పాతాళ లోకంలోనుంచి...పగపట్టిన నాగ కన్యకలా బుస్సుమంటూ వచ్చాను."

వెక్కిరింతగా కనుబొమ్మలు దగ్గరగాలాగి, కళ్ల పైభాగం మీాద నుంచి నవ్వింది.

"ఈ వెళ్లడం వెళ్లడం హిమాలయాల్లోకేనా, లేక ఇంటికి వెడతావా!"

శర్వాణి హాత్య చెయ్యడం ప్రారంభించింది.

"తెల్లబోతావేం? నీ అంత సంస్కృతం నాకు రాకపోయినా తాత్పర్యం నాకు తెలుస్తుంది....ఎన్నాళ్లనుంచి ఈ వేదాంతం జనూ!"

ఈ పిలుపు జనార్దన శర్మ గుండెల్లో చెయిపెట్టి కలచింది. ఈ పిలుపు మళ్లా పదేళ్లకు—అబ్బ! మానవజీవితం ఎంత స్నేహదుర్బలం!

ఆమె చరచరవచ్చి, చేతిలో పుస్తకంలాక్కొని దూరంగా విసరి, విసనకర్రలా విప్పారిన పుస్తకం పేజీలు చూసి పగలబడి నవ్వుతూ అతడు లేచిన పడక కుర్చీలో కుప్పగా కూర్చుంది. తాంబూలపు పచ్చకర్పూరపు పరిమళం, తలమీది తెల్ల గులాబినూనె సువాసనా, మల్లెపూల సుగంధప్రళయం అతని నోరు నొక్కి ఊపిరాడనివ్వలేదు.

చాలా వైరాగ్యాలింతేగాబోలు! ఆడపిల్ల ఒక్క కర్పూర హాసం చాలు కోటి గంభీర ముద్రల్ని తలకిందులు చెయ్యడానికి!

"ఎన్నాళ్లకు చూచాను వాణీ.....నిన్ను.ఇంకా జ్ఞాపకం ఉన్నానా?"

అతని మానప్రణయవాసనావ్యథ ముఖంలో విరక్తిలో రక్తిలా కనబడుతోంది.

"నేను మగవాణ్ణి కాదుగా...చూచీచూడనట్టు నటించడానికి—గుటకలు మింగడానికి—లేని మర్యాదలు పోవడానికి—అసూయతో కుళ్లిపోడానికి! నేను చూడలే దనుకున్నావా?

నీముఖంలో వెలిగే జ్ఞాపకాల బాధను—స్నేహవాసనావేశల వ్యథను?

"అంత పిరికితన మేం నీకు? నవ్వుతూ కులాసాగా మాట లాడితే ఎంత సంతోషించిఉండును? ఆయనకు చక్కగా పరిచ యంచేసి 'టీ' తో, నవ్వులతో, పదేండ్లనాటి కమ్మని జ్ఞాప కాలతో ఎంత హాయిగా గడిపివుందుము!

"అందుకే ఒకప్పుడు నాకు మగమృగాలు లేని స్వేచ్ఛా వాతావరణం ఏదైనా ఉన్నదేమో వెతకా లనిపిస్తుంది.

"నాకు తెలుసు—గాఢంగా ప్రేమించిన యువతివైనా సరే నువ్వు ధైర్యంగా మాటాడలేవు. నువ్వేకాదు. ఏమగవాడూ మాటాడడు. దొంగచూపులు చూస్తాడుగాని! నాకు ధైర్యం వుంది. నాకు అపరిచితుడైన యువకుడితో నేను నిర్మలంగా మాటా డగలను. అప్పుడు హృదయం ఎంత తేలిక అవుతుంది! బుద్ధి ఎంత సూటిగా వుంటుంది! ఈస్వచ్ఛత మీజాతికి కోసినా లేదు.

"నేను నీవంటి చిరకాలమిత్రుడు కనపడినప్పుడు మనసారా మాటాడకుండా ఉండలేను. ఇక ఒక్క నిముషం నువ్వక్కడ వుంటే నేనే హాయిగా నీదగ్గరకు వచ్చి మాటాడేదాన్ని. భరించలేక వెళ్లిపోయావు గదూ, పిచ్చివాడా! తర్వాత ఎంత బాధపడివుంటావో నాకు తెలియదా?

"స్టేషనులో దిగి నువ్వు జట్కా యెక్కివెళ్లడం చూస్తూనే ఉన్నాను. మేమూ నీవెనకాలనేవచ్చి—ఆయన ఇంకోహోటలు బాగుంటుందంటే నేనిక్కడ ఆపాను"

పట్టుపడ్డ దొంగలా—జనార్దనశర్మ ఏమీ మాటాడకుండా కోపంతో చలించే ఆమె కళ్లకేసి చూస్తూ, ఆ సీరియస్‌నెస్ భరించలేక ప్రసంగం మార్చదలచినాడు.

ఏమంటే ఏం చంపుతుందో! "ఇట్లా కోప్పడి తప్పుమార్గాలనుంచి తప్పించే లావణ్యనిధి లేక పదేళ్లనుంచి చెడిపోయాను"—పౌరుషం వచ్చినా చావని చమత్కారధోరణితో అన్నాడు.

"వివేకచూడామణిని, రాజయోగసారాన్ని, ఎడ్ల రామదాసు కీర్తనల్ని ఆశ్రయించు. ముక్తిమార్గం దొరుకుతుంది."—ఫక్కున నవ్వింది.

"జీవితమంతా ధారపోసి ప్రేమించిన అప్సరసలను ఏ వన్యమృగాలో ఎత్తుకుపోతే అభాగ్యుల కింకగతి ఏమిటి?"—శర్మ, అని భయపడ్డాడు, ఆమె మనస్సు గాయపడ్డంగురించి.

శర్వాణి శాంతంగా అందుకుంది:

"మగవాళ్లకు ఎంత ఈర్ష్య ఉన్నదయ్యా శర్మా! స్త్రీ ఎందరినైనా ప్రేమించి అందరితోనూ సుఖంగా, నిశ్చలంగా గడపగలదు; ఓరిమిగా. ప్రియులు—స్నేహితులు—అన్నలు—బావలు—మరదులు! మగవాడుమాత్రం ఒక్కస్త్రీ ఒకసారి నవ్వుతూ పొరపాటుననో, మనస్ఫూర్తిగానో తనతో మాటాడితే ఇంక ఆవిడచుట్టూ కంచెలుకట్టి ఎవ్వరినీ దగ్గరకు రానివ్వడు. ఆమె నవ్వులు—ఏడ్పులు—నిశ్వాసాలు అన్నీ తనకు అంకితం చెయ్యమంటాడు. కాదంటే గోల."

"వాణీ, నీవంటి అప్సరస అట్లాంటి వెలుగుబంట్ల దగ్గరగా కూచుంటే చూచి సహించలేను." — శర్మ యీసారి మనస్సుతో అన్నాడు.

శర్వాణి గాయపడలేదు. సరిగదా నవ్వుతూ తిరస్కారంగా—"అట్టి వన్యమృగరక్షణలో లేకపోతే మనుష్యుల్ని ఈ పాటికి ఎన్ని క్షుద్రమృగాలు నమిలిపించేవో ఊహించావా?"

శర్మకు అంకుశంపోటులా తగిలింది. వాణి వెంటనే అందుకున్నది: "శర్మా...నిన్ను అవమానిస్తున్నాననుకోకు. నిజం అంతే. ఒక స్త్రీకి ఒక పురుషుడు. ఇది ఒక పెద్ద లాటరీ. నాకు ఏ గంధర్వుడో భర్త కాలేదన్న విచారం లేదు. జీవితం అంటేనే రంగుల కలలా కనపడుతుంది. అందులో జరిగినదాన్ని దేన్నీ నిజంగా తీసుకోం. ఇందులోనూ అంతే. ఈ దాంపత్యాలు—స్నేహాలు—విరహాలు—ఈర్ష్యలు—దేన్నీ శాశ్వతంగా తీసుకో నక్కరలేదేమో! ఎందరు భార్యలు భర్తలను ప్రేమిస్తున్నారు? ఎందరు ప్రియులు ప్రియురాళ్లకు అంతరాత్మలను ధారపోస్తున్నారు! ఎందరు మిత్రులు మిత్రులకు హృదయాలు విప్పుతున్నారు? ఈ విశ్వమే సమ్మేళా కనబడే అసత్య సుందర ఇంద్రజాలం. ఇందులో సత్యాసత్యాల, శాశ్వతాశాశ్వతాల విచారణా?—నవ్వు రాదూ? తత్త్వం ఆలోచిస్తే—ఎందుకో, ఎవరో ఇక్కడ విసరివేశారు మన్ని. బ్రదికిఉన్నన్నినాళ్లూ నవ్వుతూ, గంతులేస్తూ ఉత్సాహంగా ఈ క్రీడారంగంలోగడిపి లేచిపోడానికిబదులుగా ఈ ఈర్ష్యలు—

ద్వేషాలు—కుటిల చింతలు—మనస్సులమీద పుళ్ళు—ఎందుకో నా కర్థంకాదు."

ఆమెముఖం స్వచ్ఛంగా, శరదాకాశంలా ఉంది. ఏమిఫిలాసఫీ!

జనార్దనం నోరు మూసుకున్నాడు.

కింద ఏవో మాటలు వినబడుతున్నాయి. శర్మ ఉలికిపడి—

"వాణీ,.. నీభర్త ఎక్కడ?"

శర్వాణి వచ్చే నవ్వును లోపలికి గెంటుతూ—"ఏం... ఆయనవచ్చి నన్ను నీగదిలో చూస్తే...పాపం నీకుర్యాదా పోతుందని భయపడుతున్నావా?... లేక ఈర్ష్యతో గొంతు పిసుకుతారనా? వెర్రివాడా! బెంగపడకు. ఆయన రెండవ ఆటకు ఏదో ఇంగ్లీషు సినిమాకు వెళ్ళారు. నన్నుకూడా రమ్మంటే నేనురానన్నాను. నీయిష్టంఅని వెళ్ళిపోయారు. నీకంటెఆయనకు అనేకవిధాల ఆనందతన్మయంగా ఉండడం తెలుసు. సరళమైన ఉమర్ ఖయ్యాంశిష్యులు. మానవజీవితమంటే ప్రేమతోనూ, బాధలతోనూ నవ్విన ఒక పెద్దనవ్వు అని ఆయనమతం. కనుకనే నాకూ ఆయనకూ సరిపోయింది......పడుకో—నే నింక వెళ్ళిపోతున్నాను. నీకళ్ళు నిద్రతో తూలుతున్నాయి. నిన్ను చూచినప్పటినుంచి నీతో మాటాడలేదని, ఏదో వాక్కు కతీతమైన శక్తి ఇచ్చిన ఇలాంటి సంఘటనల్లో తప్ప నిన్నువంటివారిని చూడడం పడదని నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. ఇంక వెడుతున్నాను. సుఖంగా నిద్రపో" అని లేచి వెళ్ళి పోతోంది.

గోడవతల పకపకనవ్వు! అద్దాల తలుపులలోంచి కూడా కహకహ నవ్వు! ఆశ్చర్య గంభీరమైన జనార్దనశర్మ ముఖంలో ఒక చేదు చిరునవ్వు!

---

# స్వర్ణయోగం

ఎప్పుడేనా ఊహించావు? ముసలి గాలిచెట్లూ—పాత పెంకుటిళ్ళూ—చెరిగిపోయిన జ్ఞాపకాల్లా వింత వింత కథలు చెబుతాయి—

ఎన్నో సంవత్సరాల అనుభవాలలోనుంచి నాగరికతలోనుంచి ఎంత ఎత్తుగా ఎదిగినా—అదుగో ఆ కూలిపోయే ప్రహారీల నడుమ, తులుకుతూ పరధ్యానంగా ఉన్న మాజమీందారు గారి పెరట్లోని ముసలి పెంకుటింటి, ప్రక్కగానే నడుస్తూ ఉంటే యీకథ జ్ఞాపకం రాకుండా ఉండదు.

ఇలాచూడు—ఇప్పుడు ఉప్పుమల్లిపోయిన జమీందారు గారి మేడగోడల్ని—సున్నంలేక పొగరంగు తేలిన అంతఃపురాలను—ఎండిన దిగుడు బావుల్ని, పగిలిన నగిషీలను (కొంచెం వెనక్కిజరిగి) రంగులతో, రక్తితో—భక్తిచేసుకో గలిగితే అదీ నాకథాకాలం—

హఠాత్తుగా కనకపు సింహాసనంమీద పడ్డ అదృష్టవంతుల్లో గోవిందబాబుగారిని ముందు చెప్పి—ఇంకొకరిని చెప్పాలి.

ఆయన కడుపు చలవ దొడ్డది. ఎనమండుగురు పురుషసంతానం, ఏడుగురు బంగారపు బొమ్మలు ఆడపిల్లలు. శ్రీబాబుగారికి సీమకుక్కలంటే వల్లమాలినప్రేమ. సుమారు పాతికవేల రూకలు వెచ్చించి నాణ్యమైన పరాసుకుక్క కుటుంబాలను కొని వినోదంగా పోషించేవారు. చిరంజీవులు చిన్నబాబులికి నీచమైన శునకపోషణం ఏహ్యంగా తోచి శుభ్రమైనఆడపిల్లల్ని తలో యిద్దర్ని పోషించేవారు.

గోవిందబాబుగారు ధర్మరాజు. ఎవరికెంత డబ్బు కావలిస్తే అంతా ఖజానాలోంచీ, భూములమీద నుంచి తెచ్చి, వాడుకోడమే, కాని, ఎవరినీ ఎప్పుడూ, 'దేనికెంత' అని అడిగిన పాపాన్ని పోలేదు. కొన్నాళ్ళకు ఖజానా అడిగినంతా యివ్వలేక మూలిగింది. చాలా భూములు అశోకవనంలో సీతలా అన్యాక్రాంతా లయాయి. శ్రీవారికి ఉభయులమీద పట్టరానంత కోపం వచ్చింది. చిన్నబాబులు శాంతమూర్తులు "ఆసూర్యం పశ్యులు"

ఒకనాడు శ్రీబాబుగారు మధ్యాహ్నం ఫలహారంచేసి శుభ్రమైన లంకాకు చుట్టవెలిగించి, పొగపీల్చుతూ వదలుతూ మేడ మీదసోఫాలోకూచుని ఒక సీమకుక్కనులాలించుతూండగా—చనువైన నౌకరు వెంకటస్వామి వచ్చి జమీందారుగారి పాదాల దగ్గిర కుక్కను నిమురుతూ కూర్చుని యేదో చెప్ప దలచుకున్నవాడిలా కనిపించాడు. బాబుగారది గ్రహించి అన్నారు 'ఒరే స్వామి గ్రామంలో విశేషాలేమిట్రా' అని.

వెంకటస్వామి కొంచెం దగ్గి చేతులు నలుపుతూ 'చిత్రం చిత్రం వూళ్ళోకి మహా గొప్ప ఓగిఒకరు యిజయం చేసారండి. ఊరి నెలపల గంగరావిచెట్ల దగ్గర పెద్దనెగడి ఎలిగించి, మంచి తీర్తమయినా బోంచెయ్యాక బగమంతుడు సూర్యనారాయణ మూరితికేసి సూస్తూ పద్దినాలనుంచి ఏకటాకీని ఉన్నారంట బాబయ్యా, నిన్నట్నుంచి చుట్టుపట్ల ప్రజ రాణువులుగావచ్చి పళ్లూ, పలాలతో దరిశనం చేస్తున్నారు. ఆ మగానుబావుడు ఒక్కర్నీ కన్నెత్తి చూడడు. ఆడంగులంటే ఆమడ దూరంలో ఉండాలంట. ఏం మహా త్తెంప్రెబూ! ఉదయంకన్నా తెరసి సిరు నవ్వునవ్వి, పడిగాపులడివున్న జనాన్ని నూసి ఎర్రిమానవులు— అని పెనిమి ఇరిసి పొయిబుగ్గి, మంతిరించి యిసిరేసరికి అన్నీ రూపాయిలంట బాబయ్యా! దాంతో, మూరుకుల కేంటి బాబయ్యా—రూపాయిలకోసం తోపులాట జరిగే సరికి విసి గెత్తి ఓగీశ్వరులు సిటికేసి మాయమై పోయారండి—

మద్దానం...ఓగంట కితం మన పెద్దమామిడి తోపులో దివాణం కోసం కాయలు కోస్తుండగా ఆమహారాజు ఒక సువర్ణరేక చెట్టుకింద నుటం వేసుకొని ముక్కుమూసుకొని జపంసేసుకొంటూ నన్ను కను సొంగ్గతో పిలిసి "ఏమిరా ఈ ఊళ్లో సొర్ణం సేయించే ప్రెబు వెవరయినా ఉన్నాడా— ఉంటే సేసిస్తాం, ఒక్కరోజు కంటె ఇక్కడ వుండం ఒక్కమణుగు దాకా ఈగ్రామానికి యివ్వదలిశాము. అని వెంటనే సమాధి లోకి ఎలి పోయారు. బాబయ్యా, మాగనమైన ఓగి..." అని

వెంకటస్వామి అంగన్యాస కరన్యాసాలతో విన్నవించేసరికి, గోవిందబాబుగారికి పట్టరాని ఆశ్చర్యం కలిగింది. నిందుకొనే ఖజానా మాట, మణుగు బంగారంమాట రెండూ జోడించి తలుచుకొంటె తనకోసమే భగవంతుడు ఈయోగిని యిక్కడికి పంపాడని నిశ్చయమయింది. లేకపోతే ఊరంతా ఒదిలి తన మామిడితోట నమగ్రహించడం తన నౌకరుతో చెప్పడం ఎందుకూ? అన్నిటికంటే ముఖ్యం సువర్ణరేఖ చెట్టుక్రింద కూర్చోడం.

వెంటనే జమీందారుగారు లేచి నించుంటూనే జోడులో కాలుంచుతూ, స్వామీ, లే, వెంటనే యోగీశ్వరుల దర్శనం చేద్దాం అంటూ చరచరా మేడమెట్లు దిగారు.

## 2

జమీందారుగారి భవనపు వెనకవైపున ప్రత్యేకంగా వుండే పెంకుటిల్లు జనప్రవాహంతో నిండిపోయింది. ఉదయంనుంచీ కనిపెట్టుకున్నా యోగిదర్శనం కావడంలేదు.

గ్రహ బాధలవాళ్ళూ, పిల్లలు కోరేవాళ్ళూ, పురాణ వ్యాధులవాళ్లూ, తరుణోపాయపరులు, ఏదోసమయం చూచి యోగినిదర్శించి వెళుతున్నారు. స్త్రీలు రావడానికి వీలులేదు. కనుక భర్తలే సంతాన విభూతి రాయించుకు వెళుతున్నారు. గోవిందబాబుగారు తమభవనంలోనే దయచేసి ఉండమంటే

యోగీశ్వరులు స్త్రీదృష్టిని పరిగ్రహించడానికి దూరంగా యీ యింట్లో వుంటామన్నారు.

వచ్చి పదిరోజులయింది. భక్తులు, మోక్షార్థులు, ఆర్తులు, ఎక్కువ అవుతున్నారు నానాటికి—వచ్చిన వారందరికీ భోజనాదికం ఏర్పరచమని యోగి ఆజ్ఞ. జమీందారుగారికి దగ్గరగా ఒక వెయ్యి కర్చుఅయినా యోగీశ్వరసేవ వ్యర్థంకాదని గోవిందబాబుగారు ఘట్టినమ్మకంతో ఉన్నారు.

అష్టదళపద్మం మీద వ్యాఘ్రచర్మం పరచి పీఠాసనం మీద మౌనంగా కూర్చునే, వారిని దర్శిస్తేచాలు, సర్వపాప వినాశనం అవుతుంది. బలిష్ఠమై కండలు తేరిన పచ్చని సోగ శరీరం. కనుబొమ్మలమధ్య అర్ధచంద్రాకారంగా కుంకంబొట్టు నల్లనిజడలు గడ్డమూలోంచి, పటిష్ఠమైన యౌవన ధృఢిమ కనబడుతోంది. ఆయన, రోజు మొత్తంమీద ఒకటి రెండుసార్లు మాత్రం జమీందారుగారితో మాటలాడడం కద్దు. తక్కిన వన్నీ కనుసంజ్ఞలతో యిష్టభృత్యుడైన వెంకటస్వామితో సూచిస్తారు. స్వామి పరుగులమీద యోగివారి సూచనలు అమలు జరిపి వారిదృష్టి పడేచోట మళ్లీ ఒదిగి కూర్చుంటాడు.

## 3

ఆరోజున స్వర్ణయోగ సాధనం చేస్తామని యోగిగారు వెంకటస్వామిద్వారా ప్రకటించారు. పరగ్రామాలనుంచి వచ్చే జనప్రవాహాన్ని టక్కున ఆపుచేశారు. యోగీశ్వరులు పూర్తిగా

ఆ వేళ నిరాహారం, ఆయన కామదహనంచేసిన రుద్రమూర్తిలా ఆరోజున దుర్నిరీక్ష్యంగా ఉన్నారు. ఒక గదిలో పెద్ద హోమ గుండం తవ్వారు. చుట్టూ తొమ్మిదిరంగుల ముగ్గులుపెట్టారు. ఎదురుగా భయంకరమైన కాళీమూర్తి, ఆంజనేయ విగ్రహం, పట్టుగా చిత్రించారు. వాటికి రెండువైపులా రెండు అఖండ జ్యోతులు తీక్ష్ణంగా వెలుగుతున్నాయి.

64 రకాల పత్రి, 72 రకాల పువ్వులు 116 రకాల ఫలము లతో పూజ దివ్యంగా తెల్లవారుజాము మొదలు జరుగుతోంది. ఒక్క యోగిగారు మాత్రమే దీక్షలోఉండి సాయంకాలానికి పూజాహోమవిధులు పూర్తిచేసి జమీందారుగారికి కబురు చేశారు. "నాపూజాదీక్ష ముగిసింది. శ్రీవారు జనానాతోకూడా వచ్చి తుది రోజుగనుక దర్శనంచేసి వెళ్ళవచ్చును."

గోవిందబాబుగారు భార్య కూతుళ్లతో పట్టుబట్టలు కట్టు కొని భయభక్తులతో వచ్చి యోగి ఎదుట వారి ఆశీస్సులు కోరి నిలుచున్నారు. యోగిపద్మాసనం మీద ఊర్ధ్వకాయం ఋజ్వాయతంచేసి కన్నులు మూసుకొని ఉండి అభయహస్తం పట్టి 'ఇష్టస్వర్ణసిద్ధిరస్తు' అని పలికి, స్త్రీలను దూరంగా వెళ్ళ మని సంజ్ఞచేసి కళ్ళు తెరచి 'రాజా, అదృష్టవంతుడవయ్యా నీ కోరిక ఇకగంటలో తీరుతుంది.' అని స్వగతంలాంటిప్రకాశంగా చెప్పికాని ఒకగట్టి పరీక్షమాత్రం ఉంది. —కాళీమాయ ఉందిలే మన పాలిట...దానితోసిద్ధి. ఇదిగో పులినాలిక, లేడి కన్నూ, కుందేటిచెవి, చిలకరెక్క వెయ్యినూట ఒక్కపసర్లతో

మర్దించి ఈఘటంనింపి దీన్ని మంత్రం పూతంచేసి ఈ హోమ గుండంమీద పెడుతున్నాను. అయితే ఒక గట్టిచిక్కుమాత్రం ఉంది.

రాత్రిసరిగ్గా ఒంటిగంటకు ఈపసర్లు పక్వమయ్యే సమయానికి ఒక కన్యక పురుష స్పర్శ ఎంతమాత్రం ఎరగనిది కుడి బాహుమూలంలో తిల సదృశమైన పుట్టుమచ్చ కలది సర్వాభరణ భూషితురాలై నిర్భయంగా వచ్చి ఈమూలికను ఈ భాండంలోవేస్తే, రాజా! తెల్లవారుజాముకు ఈఘటం, లోని పదార్థంతో సహా యావత్తూ సువర్ణమయం అయిపోతుంది. ఆమెకు ఎట్టిపరిజనమూ ఉండకూడదు. భగవతికాళీమాయయే ఆమెను వెన్నాడి రక్షిస్తుంది. అస్మదాదుల వంటివారు కూడా ఇక్కడ ఉండరాదు ఆమెలో కాళీమాయి ఆవహించిఉంటుంది. ఎదుట పడితిమా తల పగిలిపోతుంది ఆసమయానికి మేమెక్కడో సమాధిలోవుంటాము. తీరిపోతుంది. ముందువిషయం ఆలోచించు" అని మౌనముద్రవహించాడు. గోవిందబాబు గారికి పచ్చివెలగ, గొంతు బడినట్లైంది. 'చిత్తం' అనిమరువుగా అని రాణివాసంతో కూడ వెళ్ళిపోయారు.

## 4

ఇంకా సూర్యోదయం కాలేదు. తూర్పున తెలిరేకలు అప్పుడే విడుతున్నాయి. జమీందారుగారు సువర్ణభాండం గురించి సుందరస్వప్నం ఒకటి కంటున్నారు—ఒకదివ్య సుందరవిగ్రహం

అచ్చంగా తన మూడవకుమార్తెను పోలింది ధగధగ మెరిసే బంగారు కుండను చేతితో పట్టుకొని అందించబోతున్నది. చేయి జాస్తే పకపక నవ్వి ఇంకోవైపు తిరిగిపోయింది. నాకేనాకే అంటూ శ్రీబాబుగారు రెండుచేతులూ చాపగా అంతర్థానం అయిపోయింది.

చట్టునకళ్ళు తెరచి చూడగా నౌకరుఒకడు బాబూబాబూ అని ఆందోళనగా తనను లేపుతున్నాడు భవనం అంతా అల్లకల్లోలంగావుంది. పెద్దపెద్ద కేకలు—తిట్లు—వెర్రిపరుగులు—తో భవనమంతా నిండిపోయింది. నిద్రకళ్లను చెవులను బాగా విప్పి వినగా నౌకరు మొర్రపెడుతున్నాడు. "బాబూ, మోసం ద్రోహం, హోమగుండం గదిలో ఎవ్వరూ లేరు. ఐదువేల జవాహరితో చంద్రావతమ్మగారు ఐపులేరు. అమ్మగారికి మతిపోయింది"! అని గోలపెట్టాడు. జమీందారుగారు ఒక్కతూలు తూలి "అయితే స్వర్ణయోగం నాకా ఆబైరాగిముండాకొడుకా? బంగారపుబొమ్మలాంటిపిల్ల ఒంటినిండాబంగారం వెంకటస్వామిని తక్షణంపిలు" అనిముందుకు దూకారు. నిన్న సాయంత్రంనుంచీ స్వామి 'పతా' లేదు బాబయ్యా" అన్నాడు నౌకరు ముఖం తెలవేస్తూ—



# కళాభాయి

'చెన్నపురి దక్షిణమహారాష్ట్ర ఇనుపదారిలో' అది ఒక గొప్ప 'కూడలి'

బెజవాడ రైల్వే స్టేషన్. రకరకాల ప్రకృతులు—కొత్త కొత్త మనుష్యులు—వింతవింత యాసలు. అవి అందాలు కావు, అవి 'షేపన్లు' కావు. భూలోకస్వర్గం—స్వర్గలోకపు నరకం—

పగలు పదిగంటల వేళ—చెన్నపురినుంచి వాల్తేరు 'పాసింజరు' వచ్చే 'టైము' ఇంకా మొదటిగంట కొట్టలేదు.

ఒక జట్కా వచ్చి 'ఓవర్ బ్రిడ్జి' దగ్గర ఉన్న నిద్రగన్నేరు చెట్టుకింద ఆగింది. టాంగోగు బురఖా—మాష్టరు విఠల్‌రావు—అదో రకమైన చూపుతోను బండిలోంచి వెడలెను సిగరెట్టుపాణి ఒకాయన—బండిబాడుగ ఒక అందంలో పారేసి రంగుఖద్దరుగుడ్డ కప్పిన తోలుపెట్టె కూలీని పట్టుకో మని వంతెనమెట్లు ఎక్కాడు.

## 2

ప్రయాణీకులు రైలుకోసం నిరీక్షిస్తున్నారు. మునిసిపల్ చెత్త బండెడు పుస్తకాలతో పుస్తకాలబ్బి—'లక్కా' సామాన్ల మనిషీ, కాఫీఅయ్యరూ బళ్ళు తోసుకుని రైల్వేయానతో అరుస్తూ తిరుగుతున్నారు. పసిబిడ్డల ఏడ్పూ—పడుచువారి ఒయ్యారాలూ, దేశభక్తులతీపీ, ఇన్స్యూరెన్సు ఏజంట్ల నిరంతర —వాగుడూ స్టేషనంతా నిండి ఉండగా ఆయన వచ్చి నిరీక్షణ

గృహంవైపు వెళ్లి అక్కడ ఖాళీ లేకపోగా ఇవతల బెంచి దగ్గర పెట్టె పెట్టించి కూర్చున్నాడు. వేసంకాలం. చాలా ఉక్కగా ఉంది. జేబురుమాలు తీసి తుడుచుకుంటూ రెట్టింపు శ్రమతో ' అబ్బా ' ప్రపంచం అంతా ఎంత వేదనామయుంగా ఉందీ' అన్నాడు. తనకు చెమట పట్టినందుకో, పక్క బిచ్చగత్తె దీనాలాపాలకో,

సూటుకేస్ తెరచి ఆంగ్ల అందగత్తెగల జపాను విసనకర్ర తీసి విసరుకుని జేబులోని అద్దం దువ్వెన తీసి క్రాపు దువ్వి మొహం ప్రసాధిస్తూ పైకి చూసి నమస్కారం అందుకుంటూ "ఓహో! నంద నందన్ గారా! నమస్కారం" అన్నాడు సవిలాసంగా. నంద నందన్‌గారు దేశభక్తుల కాంగ్రెసు చిరునవ్వుతో "ఆంధ్రదేశపు హిందీప్రచారం గురించి అలహాబాద్ నాయకులతో కొన్ని సంప్రతింపులకోసం వెడుతున్నానండీ. ఆంధ్రులంతా హిందీ నేర్చుకోడమే కాకుండా తద్వినాదికర్మకాండ అంతా హిందీలో జరిగితే మంచిప్రచారం అవుతుందని మొన్నటి ఆంధ్రసభల్లో నేను ప్రతిపాదించగా అది ఏకగ్రీవంగా —ఏకహస్తంగా నెగ్గిపోయిందండి కొందరు ఆంధ్రదురభిమానులు కాదని గోలించినా. హిందీకంటె దేశమోక్షం యేముందో చెప్పండి" అన్నాడు ఉపన్యాసోద్రేకం నెమ్మదిగా నిమ్మళించుకుంటూ.

"సందేహమేం—హిందీ దేశమోక్షానికే అందులోనూ ఆంధ్రదేశ మోక్షానికే వచ్చింది. అయితే నన్నుమాత్రం

ఠాకూరుబాబు కవితామృతం తాగెయ్యి డానికి ముందు బంగాలీ నేర్చుకోనివ్వండి. మాకు దేశం కంటె కళ ముందు. కళారాధన జరిగిన తరవాత దేశభారం వహిస్తాం. విశ్వప్రవృత్తి అర్థం కావాలంటే విశ్వమానవకల్యాణం సిద్ధించాలంటే— విశ్వభారతిగ్రంథాలు చదివితీరాలి, శాంతినికేతనం తొక్క తీరాలి. కాక తెలుగులో ఏముంది చెత్త."

"అంతే అంతే, తులసీదాసురామాయణం ముందు తెనుగు భారత, భాగవత, రామాయణాలు దిగదుడుపులు గదండీ"

"అయితే—తిక్కనభారతం మాత్రం—మీరూ చదివా రనుకుంటా"

అబ్బే—లేదులెండి. తెను గేమీ చదవను—సరే—మీ రెంతవరకూ?"

"నే నీమధ్య ప్రకటించిన 'ఉషోరాణి' చూసి అనకాపల్లె ప్రజలు విముగ్ధులై నాకోక సన్మానసభ ఏర్పరిచారు—ఊరికే లేనిపోని ఆడంబరాలు ఎందు కన్నా విన్నారు కారు."

"ఎంతమాట? మీవంటి కవిని సన్మానించడం ఆప్రజల అదృష్టం—కాస్త 'ఛా' పుచ్చుకుందాం రాస్తూ"

"ఇప్పుడే కాఫీ అయింది మీరు వెళ్లండి"

నందనందన్ శిష్యబృందంతో టీకొట్టువెంపు నడిచారు.

కళాభాయి సిగరెట్లు వెలిగించి ఆత్రంగా రెండుదమ్ములు లాగి

ప్రేమభారాన హృదయమ్ము ప్రిదిలినట్టి
పడుచుభావాల కోక మహాభాష్య మేను

'క్లాసికల్ టెంపర్ మెంటు' కొట్టి లాక్కొచ్చాను. అనుకుని
ఇంకోదమ్ములాగి ' షెల్లీ ' లా మొహంపెట్టి

గొంతుతీగలు పగిలి ప్రేమప్రకోప
బంధురము లైన ప్రణయభావాల రేపి
పుడమి కెత్తిన పురిటినొప్పుల విధాన
వేయి కావ్యమ్ములే ప్రసవించివేయు.

అని కూనిరాగరంజితంగా చదువుతుండగా రైలుకు మొదటి గంట కొట్టారు.

# 3

ఒక చేతిలో థెర్మోఫ్లాస్కూ, తిత్తి తొడిగిన పాలజారీ రెండవ చేతిలో ఐదునెలల పసిబిడ్డనూ ఎత్తుకుని రైలు దాటి పోతుం దేమో అన్న తొందరంతా మొహంమీద వ్రేలాడు తూండగా ఒక పదహేనేళ్ల అమ్మాయి, ఆమె వెనుక ఒక బట్టలమూటా, పాతసూటుకేసూ, కూజా, గొడుగూ ఈడ్చు కుంటూ తెస్తూన్న పాతికేండ్ల యువకుడూ వచ్చి ప్లాట్ ఫారానికి దగ్గరగా కూర్చున్నారు. మొహాలు చికాకుగా ఉన్నాయి. పసిబిడ్డ ఎందుకో ఏడుస్తోంది. తల్లి అయిన ఆ అమ్మాయి, బిడ్డను సముదాయించలేక పాలతిత్తి బిడ్డగొంతులో కుక్కి, భర్తతో—

"ఇప్పు డెక్కడికి వెళ్లడం!—"

"గోదారిలోకి"

"అట్లా విసిగిపోయి దిగులుపడితే ఎట్లా చెప్పండి ఏదో ఇంకోదారి చూడాలిగాని"

"ఆదారికంటె ఏమీా కనిపించదు. ఆరునెల్లు కౌన్సిలర్సు అరుగులమీాద పడి దొర్లి సంపాదించిన మూడునెల్ల ఉద్యోగం అయిపోయింది. కాఫీహోటల్లో పద్దులు వ్రాస్తాను పదిరూపాయి లిమ్మంటే ఇదివరకేఒక B. A. L. T. ఉన్నాడు. పొమ్మన్నారు. ఏంచెయ్య మన్నావు"

"స్టేషన్‌లో వచ్చి పడ్డాం—కానీండి చూద్దాం, తునికి రెండు టిక్కట్లు కొనండి"

"అత్తవారిమీాద—ఆధార...పడడం ఆత్మహత్య సీతా!"

"ఏం చేస్తాం? కొన్నాళ్లు అజ్ఞాతవాసం—రైలువచ్చేస్తోంది లెండి చప్పున"

ఎట్లాగో సమాధానపడి సుబ్బారావు టికెట్ల కిటికీవెంపు వెళ్లాడు.

సీత పైటచెంగుతో మొహం తుడుచుకుని ఎదట కనిపించే బెజవాడ చిక్కుచిక్కు అయోమార్గంవలె అయోమయంగా ఉన్న తమ భవిష్యత్తు గురించి తన జాలికళ్లతో ఆలోచిస్తూ శూన్యంగా ఒకసారి కళాభాయివైపుచూసి తల దించుకొన్నది. కళాభాయి నిదానించి ఆమెనుచూసి తన జపానునోటుబుక్కుతీసి

ప్రేయసీ యేల చూచెద విట్లు నన్ను
పరిభవిల్లిన నాప్రేమబాధ తెలిసి
హిమము దొరలిన మల్లికాసుమము రీతి

వలచికొమ్మ, మలచికొమ్మ,విలిచికొమ్మ
నావలపుతో నిన్ను
నాశనము గావించి
ఉరిపోసికొని చత్తునా—ప్రేయసీ
మరి కౌగిలికివత్తువా?
అని వ్రాస్తున్నాడు.

సుబ్బారావు తొందరగా టిక్కెట్లు తెచ్చి "సీతా! రైలు వచ్చేసింది పిల్లను తీసుకో అన్నాడు" సామాను సర్దుతూ. సీత మెల్లగా భర్తతో "ఎవరండీ ఆయన ఏదో మతిపోయినట్టు నావైపు చూస్తూ రాస్తున్నాడు" అంది.

"చచ్చాం—భావకవికాబోలేవ్, వీధిలోపడిపోతాం లే,లే" అన్నాడు వికారంగా. రైలు వచ్చేసింది.

గబగబ ప్రయాణీకుల్లో కలిసిపోయి ఆదంపతు లిద్దరూ ఏదో పెట్టెలో ఎక్కిపోయారు.

కళాభాయి పెట్టెను కూలీ కిచ్చి ఖద్దరుబురఖా నలగకుండా, దువ్వీన క్రాపు చెదరకుండా 'పోజు' మార్చి 'పోజు' ఇస్తూ రైలు దగ్గరకు వచ్చాడు.

సీత యెక్కిన పెట్టెకోసం ఎంత వెదకినా దొరక్కపోవడం చేత రైలు కూతతో ఇంకో పెట్టెలో ఎక్కక తప్పిందికాదు.

## 4

రైలు పొగలు కక్కుకుంటూ పరుగెత్తుతున్నది. 'ముస్తాబాద' లోఎక్కిన కంటిబిచ్చగాడు "పొయ్యేటప్పుడూ వెంటరాదు

వక వుచ్చివక్కడైనా" తండ్రీ ఒక్క డబ్బు నాయనా కాళ్ళు లేవు—దిక్కులేనివచ్చిని" అని రెండు చేతులు చాపుకొని కళాభాయి దగ్గరకు వచ్చేసరికి "పోపో వెధవగుడ్డలకంపు— అలాపైకి ఏడువు' అన్నాడు అసహ్యంగా. పక్క ఉద్యోగి 'పర్సు' తీసి ఒక డబ్బు ఇవ్వగా పైకి పోయాడు. కళాభాయి సిగరెట్టు వెలిగించి పక్క ఉద్యోగికి 'ఆఫర్' చేస్తూ

"ఎక్కడినుంచి వస్తున్నారండి"

"వద్దండి—అభ్యాసంలేదు—అనంతపురం నుంచి వస్తు న్నాను"

"అక్కడి గ్రామం ఎలాఉందండి?—ఏనాడు మనకు తొల్లిటి ఔన్నత్యం వస్తుందో కాని ప్రస్తుతం ప్రజలు— నిరుద్యోగ సమస్యలతో—గర్భదారిద్ర్యంతో తహతహ లాడి పోతున్నారు. అటు బీహారు— ఇటుక్వెట్టా —దైవోపహతం అయిపోయాయి గదా; నేనిక్కడ రాష్ట్రీయ హరిజనకమిటీ కార్యదర్శిని, నేను నాలుగువందల రూపాయలు పోగుచేసి పై రెండింటికీపంపాను. చూడలేదండీ నా పేరు ఆంధ్రహిందూ, లలో,

ఉద్యోగి పరధ్యానంగా చూస్తూ

"ఔ...ను—మీరు కొత్తకవిత్వం చెబుతారా?"

"ఉషారాణి—'మొగలిడొంక' అని రెండుకావ్యాలు ప్రకటితములై వేనోళ్ల ప్రశంసింపబడ్డాయి—నాపద్యాలు నేనే చదవా లని చాలామంది మాపెద్దలు అనడంచేత నేనే శ్రమ అనక ప్రతిచోటికి వెళ్లి చదువుతూంటాను. ఇంకా ఖండఖండ

కావ్యాలు అప్రకటితములు ఉన్నాయి—ఆమె అనే కావ్యం ఒకటి కొత్తగా వ్రాస్తున్నాను."

"అనగా ఖండఖండా లంటే—రాసి చింపెయ్యడ మెందు కండీ"

"అబ్బే కాదండీ— మా కొత్తపద్యాలని ఖండకావ్యం అంటాం. అట్లా అన మని మాగురువాజ్ఞ"

ఉద్యోగి వీరంతా ఒక మతంలో బైరాగిశిష్యులే కాబోలు అనుకొని

"అయితే ఆమె అనే పుస్తకంలో ఇతివృత్తం యేమిటండి!"

"మీరు మాఖండకావ్యాలు చదవలే దన్నమాట— నేనొకామెను ప్రేమించి నాప్రణయప్రవృత్తి అంతా ఒక అనుభవముద్రలో వెలువరించిన కావ్యం అది"

"ముద్ర లేమిటి! ఆమెమీద ఇంత కావ్యం వ్రాయడానికి మీకున్న హక్కేమిటి?"

"ఆమె నన్ను ప్రేమించింది—అదే హక్కు"

"మీది పొరపాటేమో అసి ఆలోచించారా? మనం ప్రేమ విషయంలో నూటికి నూరుపాళ్ళు గుడ్డిగా ఉన్నాం. ఇట్లా నచ్చిన స్త్రీమీ దల్లా కావ్యాలు రాస్తూ ఉంటే కొన్నాళ్లకి మన వాఙ్మయం అంతా వలపు కవిత్వంతో నిండిపోయి మన పెద్దలు కాంక్షించిన విశ్వశ్రేయస్త్వం ఎగిరిపోతుంది కదండీ"

"ఒక అనుభవం కవిని ఊపుతుంది—దానినుండి కావ్యం వస్తుంది. కళకోసమే కళ. నీతి నియమం లేదు దానికి"

"పూర్వకవులు అన్నీ ఊగులూ ఊగి ఆగి పాత్రల చాటున తమ అనుభవాలు మనోహరంగా చెప్పేవారు, మీ 'డైరెక్టు మెథడు' వల్ల ప్రమాదాలు కూడా ఉన్నాయి. ఎందుకులెండి లేని పోని విమర్శ—ఇదో వొంగ—ఏదీ 'ఆమె' లోది ఒక పద్యం చదవండి."

పిఠాపురం స్టేషను. ఒంటిని గుడ్డపీలికలతో మాత్రమే కప్పుగున్న ఒక బిచ్చగత్తె ఈపెట్టెలో ఎక్కి పీలికలు సర్దు కుంటూ

"ఏలరా రావాణా ఇంత కావరా మేల ?
పతివ్రతను చెరబెట్టి బతుకూతా వటరోరి"

ఒక్కతండ్రికీ కనికారం గలగదా—ఏదరమపెబువు గరబం కరగదా—ఒక్కరాగిడబ్బు తమ ఉమ్మేసే తాంబోలం సాటి కాదు, మొగుడులేడు, బిడ్డల్లేరు, ఎండుకొమ్మనండి బాబయ్యా!"

కళాభాయి "ఏంముష్టి వెధవలండీ? చంపేస్తున్నారు. దేశాంతరాల్లో ఎవరికీ ముష్టెత్తుకోనివ్వరు. మన దేశానికే వచ్చింది ఈవిడ్డూరం అంతా. పెద్దమనిషితో మాటాడుతూంటే ఇప్పుడే ఏడవాలి ఆస్తీయచరిత్ర అంతా, అలా వెళ్లి మళ్ళీరా చిల్లర లేదు."

ఉద్యోగి చిరునవ్వుతో "ఇంత దరిద్రం ఇంకే దేశంలోనూ లేదు కదండీ? ఇంకా రావలసినంతమంది బిచ్చానికి రావడమే లేదు. కొంపల్లో అన్నంలేక మగ్గిపోతూ ఉన్నా. ఏ, అమ్మీ! ఇంద" అని ఒక డబ్బు ఇచ్చి 'ఆమె' లోది ఒక్క పద్యం చదవరూ? అన్నాడు.

"ఈముష్టి పీనుగుల మధ్య ఏంపద్యాలు ఏంకవిత్వం ?"

"ఆదరిద్రనారాయణుల దీనావస్థమీాదే చెప్పండి—అందమయిన ఆడంగుల మొహాలు చూస్తేగాని కవిత్వం రాదాండి? ఇంతికీ పద్యం చదివారు కారు"

"ప్రేయసీ — — —
హిమము — — —"

"అయ్యా, మల్లెపువ్వుకీ ప్రేయసికీ ఉపమానోపమేయాలు బొత్తిగా కుదరక—నాబుద్ధికి సుమండీ—పద్యం చాలా అయోమయంగా ఉంది"

"అంత 'సైంటిఫిక్'గా చూడడాని కిది పురాణం కాదండి"

"ఆగ దనండి—పోనీ విమర్శ ఎందుకూ తెలిస్తే ఆనందిస్తా లేకపోతే లేదు. మొగలి 'డొంక' లోది ఒక పద్యం చదవండి—"

"అందమయిన గడ్డిపూలు
ఆరవిరిసి తీయవలపు
సుషమ మంచు జడుల బొరలి
సుషమసుఖజ్వాలలతో
చురచుర మనె నాయెడంద"

ఉద్యోగి తెల్లబోయి—నీరయిపోయి కొంతసేపటికి తేరుకుని "అయ్యా, నన్ను మన్నించి దీని తాత్పర్యం కాస్త సెలవివ్వాలి" అన్నాడు.

కళాభాయికి ఒళ్ళు మండుకుపోయింది. "ఎవడోయ్ వీడు ఎక్కడో జనమేజయుంముండాకొడుకు దాపరించాడు?" అనుకున్నాడు. తుని స్టేషన్. బండి కవతలనుండి ఎక్కిన గుడ్డి బిచ్చగాడు "కనుగొంటి వైదేహిని" అని పాడుతూ డబ్బులకు తడువుతున్నాడు. కళాభాయికి రవులుకుపోయి "చూశాడు ఈ గుడ్డికుంక వైదేహిని ఈదరిద్రగొట్టు దేశంలో; ఈఅర్థ తాత్పర్యం గాళ్ల మధ్య కళ ఏమిటి?—కవిత్వం ఏమిటి?" అంటూ పెట్టెతో స్టేషన్లో దిగిపోయాడు. అక్కడ దిగే సీతను మరొక్కసారి చూసి ఇంకో పెట్టెలో ఎక్కుతాడు కాబోలు.

1935 అక్టోబరు ప్రబుద్ధాంధ్ర

---

# దొంగలున్నారు, జాగ్రత్త!

అప్పుడే—ఇంటర్మీడియేట్ ఎగ్జామినేషన్లో పేపరు రాసివచ్చిన విసుగున—ఒక్క విసురున కారులోంచిదూకి, ఒక్క అంగలో మేడపైకి వెళ్ళి, బొక్కులూ, నోట్సులూ 'మీ దిక్కున్నచోట చెప్పుకో' మన్నట్టు టేబిల్ మీదకు విసరి, ఆత్రంగా కిటికీలన్నీ తెరచి, హఠాత్తుగా గదిలో చొరబడే మలయపర్వత సానువుల నుండి దిగుమతియగు కమ్మతెమ్మెరలకు నల్లపట్టుముంగురులూ, తెల్లనిపైటా తపతప కొట్టుకోగా, గ్రామొఫోన్ టేబిలుకు

దగ్గరగావున్న ముఖమల్ సోఫాను ఆప్యాయంగా అనుగ్ర హించింది శకుంతలా దేవి.

కమ్మని కళావలయాలుగా, మాధుర్య నిలయాలుగా... అక్కడి శబ్దగుణక ఆకాశాన్ని ఘూర్ణైనహాయితో, పరిమళపు తేనెల్తో నింపుతూ గిరగిర సైగాల్ మహాశయుడు పాడుకు పోతున్నాడు—"సుఖ్ కే......దుఃఖ్ కే...ఏక్ స్వపన్ హై" ఇత్యాది.

ప్లేటు మార్చడానికి రికార్డుబాక్స్ వైపు చేయిచాచుతూ, చట్టున ఆత్మారాధన జ్ఞప్తివారి, అధోలోకాన్ని ఉద్దేశించి—

"మంగా, కాఫీ...కాలేజీనుంచి రావడం చూడలేదూ?"

"అమ్మా, ఇదిగో తెస్తున్నా—మరిచిపోలేదు"

శకుంతల కావలసిన రికార్డుకోసం తడవుతూ వుండగా... టేబిల్ మీాద ఒక కవరు త్తరం కంటపడింది.

ఆకస్మికంగా ఆమెముఖంలో ఒక వెయ్యి ప్రశ్నార్థక చిహ్నాలు—ఇదేమిటీ—అపరిచిత అక్షరాలు?

ఆశ్చర్యాంబరువున అనుకోని అనిమేషత్వం దఖలుపడ్డ ఆ అచ్చర ఆ ఉత్తరం అందుకొని చించింది.

చిత్తరంజన విలాసం,
24 మార్చి 32

ప్రియమైన శకుంతలకు—

ఈ ఉత్తరం ఎట్లాప్రారంభించాలో నిజంగా నాకర్థంకాలేదు.

నీవు నన్ను సరిగ్గా అర్థంచేసుకోక...నీ చల్లని నల్లనికళ్లల్లో కెంపులు చెరుగుతూ నావైపు చూస్తే...మరణాన్ని శరణు పొందవలసి వస్తుంది.

నీవు మోహినీ దేవతవలె ఒక్క చూపుతో నాహృదయాన్ని—ప్రాణాలను ఆకర్షించావు.

ప్రేమ సాక్షాత్తూ భగవత్స్వరూపం. దానిశక్తి అనంతం. దానికి ఏవీ అడ్డురాలేవు. పవిత్రమైనప్రేమలో ఎవ్వరూ తప్పులు పట్టలేరు.

హృదయపూర్వకంగా ఒకరినొకరం ప్రేమించుకుని, రెండు నీలిమబ్బుల్లాగ—గువ్వజంటవలె నీలాల నింగిపై తేలిపోవడం కన్న భాగ్యం ఏమిటి? నీవు మనస్ఫూర్తిగా ఒక్కపరి......

నీ,

రా జా రా వు.

సగంలోనే చదవడం పూర్తిచేసి...చివాలున సోఫాలో నుంచి లేచి—కవరుతో సహా...కాదగినంత ఉండచేసి చిత్తు కాగితాల బుట్టవైపుగా విసరి, కిటికీలో నుంచి శూన్యంగా చూస్తూ—

"ఎవ రీ అయాచిత ప్రేమమూర్తి? ఎప్పుడూ క్లాసులో ఇతన్ని నిదానించి చూచినట్లైనా జ్ఞాపకంలేదే?

"ఎంత బుద్ధిహీనులు! పొరపాటున గోడలవైపు—దూలాల వైపు చూచినట్టు చూసినా ఆ మామూలు చూపులోకూడా

'తివిరి ఇసుమున తైలంబుతీసి' నట్టు ప్రేమనుతీసి ఉత్తరాలు రాస్తారు కాబోలు!

"అప్పటి అమాయిక శకుంతలను దొంగ రాజు ప్రేమను అభినయించి టోపీ వేసినట్టు.. పిచ్చివాడు... ఈ రాజారా వెవరో 20వ శతాబ్ది శకుంతలమీాద ట్రయి చేస్తున్నాడు"

విరగబడి నవ్వుతూ సోఫాలో ఒరిగింది.

మంగ, ట్రేలో పింగాణీ కాఫీ కెటిలూ, కప్పులూ తెచ్చి ఎదుటపెట్టి, శకుంతలను చూసి తెల్లబోయి నించుంది.

శకుంతల ఆగి గంభీరంగా—

"మంగా, నే వచ్చేసరికి నా టేబిలుమీాద ఒక ఉత్తరం ఉంది. ఎట్లావచ్చింది ఇక్కడికి? నిజం చెప్పు—"

పాపం, మంగకు అంతా అయోమయంగా వుంది. నిజం చెప్పివేస్తే ఏంతప్పుగా పరిణమిస్తుందో? అబద్ధంగా నే నేమీా ఎరగనంటే ఇప్పుడే ఇక్కడనుంచి గెంటి వేస్తారేమో—?

గొంతులో పది పచ్చి వెలక్కాయలు...

"మాట్లాడవేం? నువ్వు దీనిసంగతి ఎరగవా?"

"అమ్మా, కోపంచెయ్యకండి. ఆకాగితంమడత కూడనిదని తెలిస్తే—తెచ్చి మీా బల్లమీాద పెట్టను. ఈవేళ పొద్దున్న దొరలాంటి ఒకాయన మన 'గేటుగుమ్మం' దగ్గర నా క్కని పించి మంచిగా నన్ను పిల్చి 'ఇది మీాఅమ్మాయిగారికిచ్చెయ్యి — చాలా అవసరం' అని ఇచ్చి వెళ్లారు. కాబో లనుకుని మీా బల్లమీాద పెట్టానమ్మా... తెలివితక్కువదాన్ని—"

నీళ్లు తిరిగే కళ్లను చాటుచేసుకోబోయింది.

అవమాన క్లిన్నమైన సాటిస్త్రీ హృదయవేదననుగ్రహించి, జాలిగా

"ఛా! నిన్నేమీ అనలేదుగా? ఈపైని ఎవరిచ్చినా ఇట్లాంటివి పుచ్చుకోకు.—?"

కాఫీకప్పు అందుకుని రెండుగుక్కలుతాగి మళ్లా ఆలోచనలో పడింది.

మంగ బల్లలమీద వస్తువులను సర్దుతూ తన పనుల్లో నిమగ్నఅయింది.

"ఎవ రీరాజా...రావు? మంగచెప్పినట్టు మాటుతో వుంటాడా? ఓహో...ఈవీధిచివ్వరిమేడ...ప్లీడరుబలరామయ్యగారి మేనల్లుడు—నరే—తరచు ఆడపిల్లలకంటె కూడా శ్రద్ధగా టాయిలెట్ చేసుకుని అందరికళ్లనూ ఆకర్షించాలని చూస్తూవుంటాడు. ఔను, యువతులుతిరిగిచూడదగిన కోమలమూర్తే! కాని—ఇంత దుర్బలహృదయుడా? నిజంగా ప్రేమారాధకుడైతే ఎంత నిదానిస్తాడు? మహాభక్తుడికి తాను భక్తుణ్ణనే తెలియదే...మహాకవికి తాను కవిననే జ్ఞాపకం ఉండదే? తన ఉన్నతిని ఎదుటివారు గ్రహించినప్పుడే దానికి స్థిరత్వం! గొప్పవారు గొప్పసాధనచేస్తారు—సిద్ధిపొందుతారు.

"వీళ్లు—ప్రేమకోసం—కొన్నియేళ్లు తపించిఉండగలరా? అగ్ని పరీక్షలకు ఓర్వగలరా? ఒకప్పుడు...అవసరమైతే—ఎట్టిత్యాగమైనా చెయ్యగలరా? వట్టిది.

" అదృష్టవశాత్తూ ఏ అమాయికకోమలినా వలలోపడితే పీల్చివేసి 'విమ్‌టో' సీసాలా మూలకు విసరి చక్కాపోతారు. దుష్యంతుడేం చేశాడు ? మధురవనదేవత శకుంతలను చల్లని మాలినీతీరాన—కుసుమిత పాటల వృక్షచ్ఛాయల్లో—ఔల్లించి, అనుభవించి, ఛీ—

" ఈపురుషవంచకులకు ఈశకుంతల ఘాటైనపాఠం చెప్పాలంటే ఎట్లా ?...

" సరే...సాహసం ?—ఫర్వాలేదు.

ఉత్సాహబలవన్నిశ్చయంతో లేచింది.

## 2

స్లేట్ కలర్ పారిస్ సిల్కు చీర కొత్తఫక్కీలో తీర్చి కట్టుకొని, లేతఊదారంగు బ్లౌజు తొడుక్కొని, నిగనిగలాడే నల్లనిజుట్టును వదులుగా—చెవులు కమ్ముకునేలాగు వాలుజడగా మలచి మెడమీదనుంచి వక్షస్థలం మీదకువిడచి, ఆననశ్రీకి 'హిమగాసీ' స్పర్శతో లావణ్యదోహదాన్ని పచరించి, రాత్రి పదిగంటలకు తన ప్రసాధనం పూర్తిచేసి శకుంతల...డ్రెస్సింగ్ టేబిల్‌వద్ద ఒకసారి తన అందాన్ని కొంటెకళ్లతో పరీక్షించి " బస్— మంగా, రెడీ " అంది.

మంగకు వట్టి గందరగోళంగా వుంది. ఈమహా ప్రస్థానం ఎంతవరకో, ఎందుకో సూచాయగా అడగడానికైనా దమ్ములు లేవు. సినీమాకా ? వేళ దాటిపోయింది. ఊహుఁ— తెలియదు.

శకుంతల అప్పుడే మేడమెట్లు దిగిపోతోంది. గదితలుపులు దగ్గరగాలాగి మంగ ఆమెను అనుసరించింది.

మేడముందటి మాలతిబవరును దాటి, గేటును వెనక్కి నెట్టి, రోడ్డుమీదుగా చైత్రశుద్ధ చవతిమసక వెన్నెల్లో ఇద్దరూ ముందుకు నడుస్తున్నారు.

# 3

రెండు మళుపులు తిరిగి తిన్నగా వీధిచివర ప్లీడరుగారి ఇంటి ముందు హఠాత్తుగా ఆగి వీధిగదిలో వెలిగే దీపపుకాంతిని నిదానించి, మంగను గదికి చేరువగా—ఒక స్తంభంచాటున నుంచునేటట్టు సంజ్ఞచేసి, గంభీరంగా తలుపుదగ్గిరకు వెళ్లి మెల్లగా తలుపుమీద 'టాప్' చేసింది.

కొన్ని నిమిషాల్లో గదితలుపులు 'హల్లో—కమిన్' అంటూ మామూలు స్నేహితులెవరో అనుకుని విడుతూండగా శకుంతల లోపల ప్రవేశించింది.

గళ్ల లుంగీ, చేతులులేని తెల్ల బనియనూ, పాంపియా తల నూనె సువాసనతో చిక్కులు చిక్కులుగా వేల్లాడే ఉంగరాల క్రాపూ, ఒకచేతిలో 'సిజరు' ధూమవర్తిక సుగంధధూమం, రెండవచేత మర్నాడు పరీక్షకు కసరత్తుచేసే షేక్స్పియరు నాటకం—తో కుసుమసుకుమారమూర్తి... రాజారావు తన బంగారుకలల్లోని ప్రేయసి ఆకస్మికంగా ప్రత్యక్షకావడం చూసి నిశ్చేష్టితుడై విస్తుపోయి, మంచి మాటలకోసం వెదుక్కుని, ఎట్టకేలకు—

"స్వర్గలోకపుదారి తప్పి ..అప్సరస ఇట్లానడచివచ్చిందా!"

"* * * *"

"ఉత్తరం చూసి...ఏమనుకుంటావో, నా పవిత్రప్రేమను అపార్థంచేసుకుని ఎలా అవమానిస్తావో అని మహా పరితపించాను." "* * * * "

"నీకు మెత్తనిఅమృతహృదయం వుంది. గాఢానురాగాన్ని అర్థంచేసుకుని, ఉత్తమప్రేమకు స్వాగతంఇచ్చి ఆదరించగలవని నాకు మొదటినుంచీ ధైర్యమే." "* * * "

"అదేమిటి—పలుకే బంగారం అయిపోయిందా? ఒక్కసారి ఆ కుర్చీలో కూచుని అనుగ్రహించరాదూ? రేపటి పేపరుకు నీవు ఎంతసేపు చదవాలి—రా! వీణ వాయించినట్టు కాస్సేపు హాయిగా మాట్లాడు."

ఇంతవరకు శకుంతల పొంగివచ్చే నవ్వును నల్లని కొంటెకళ్ల పుక్కిట బట్టి—

"ఇదేమిటి, రాజా, నన్నింతగా మన్నిస్తున్నావు? అచ్చర తోవతప్పినా నలుకూబరుడి చైత్రరథంలోకేగా వచ్చిపడింది?

"ఎన్నాళ్లు నా ప్రియుడికోసం కలలుగన్నాను! ఇంతవరకూ —ఈ పాడులోకంలో నన్నింతగా ప్రేమించినవారే కరవైపోయారు. ప్రేమపరమార్థం నీవంటి బుద్ధిమంతులకు తెలుస్తుంది గాని తదితర క్షుద్రులకు ఎట్లా తెలుస్తుంది?" * * *

"కొందరు మూర్ఖులు మా మెరుగులువారే యౌవనాన్ని చూసి, మా విలోల నేత్రాలకు తల్లకిందులై మమ్మల్నితరింప

చెయ్యడానికిమల్లె మోహించి అనేకవిధాల పీడిస్తారు. నాకు తెలుసు, నువ్వు అట్లాంటివాడవు కాదు.” “ * * * ”

“అవును: నీవంటి పక్వహృదయుడు ప్రేమకోసం ఎంతటి త్యాగమైనా చేస్తాడు—కదూ! ” “ * * * ”

“నేను గాఢంగా ఆలోచించి—ఒక్కనిముషం మాఇంట ఇక ఉండలేక ఇక్కడికి వచ్చేశాను. నిరీక్షించగా నిరీక్షించగా శిశిరలతాని కుంజానికి వసంతమూర్తిలాగా నువ్వు దొరికావు. ఈవేళ నీ ఉత్తరం చూసి నాజన్మ ధన్యం అనుకున్నాను.

“అంతా నిశ్చయమైపోయింది—ఇంక తిరగను. నాకీచదువు, పరీక్షలు, మా అన్నయ్య, అతనిసంపద—ఏమీ అక్కర్లేదు. లే—క్షణం ఆలస్యంచెయ్యకు. నాది ఓమర్ ఖాయంమతం, నాకు పాస్టు, ఫ్యూచరు లేదు; ఉన్నది ఒక్క ప్రెజెంట్.

“ స్త్రీ హృదయం ఇవ్వడమేగాని తీసుకోడం ఎరగదు. రా —ఈరాత్రే ఏ దూరదేశాలకో వెళ్లిపోయి హాయిగా పావురా దంపతుల్లా విహరిస్తూ ధన్యజీవితాలను గడుపుదాం. అడ్డు చెప్పకు—”

తనప్రేమ ఇట్లా నడికిరేయిలో గొంతు పట్టుకుని ఉక్కిరి బిక్కిరి చేస్తుం దని రాజారావు ఎప్పుడూ అనుకోలేదు, పాపం!

అతనికి శకుంతలధోరణి ఏ ఉల్లోలకల్లోల సముద్రంలోకో తనను విసరివేస్తూన్నట్టు అనిపించింది. కళ్లు గిర్రున తిరిగాయి.

అతను ఊహించుకునే భవిష్యత్తంతా వికృత దృశ్యాలతో, తెరలుగా తనఎదుట వేలాడుతోంది—మామయ్య ఇంక తన

గుమ్మం ఎక్కితే మాట దక్కదన్నాడు. అతని ఆశ్రయంవల్ల తనకు లాభించే బి. ఎ. డిగ్రీ, ఉద్యోగం—అన్నీ, రైల్లో కూచున్నప్పుడు చెట్లు వెనక్కి పరిగెత్తుకు పోయినట్టు, వెనక్కి పరిగెత్తుకు పోతున్నాయి. దేశాంతరాల్లో—స్వయం పోషక శక్తిలేక—ఈ సుకుమారితో...అన్నానికికూడా బాధపడి తిరుగుతున్నాడు. అంతా ఊసడించినవ్వుతున్నారు... ప్రేమ—ఆదర్శాలు కథలపుస్తకాల్లో చదువుకోడానికి బాగుం టాయిగాని ప్రాక్టికల్ లైఫ్‌లో ఫెయిల్యూర్ అనుకున్నాడు. కుదేలయి—

"శకుంతలా! నిర్మలప్రేమ అంటే నీకంతగా బోధపడినట్టు లేదు! బుద్ధిమంతురాలవు—వూహించు. ప్రేమకు ఇంత తొట్రుపాటు పనికిరాదు. బహు నిదానించాలి, ఓపికపట్టాలి; తొందరపడి ఎట్టి నిర్ణయాలకూ రాకూడదు." ఏం తోచక ఖంగారుగా—లాలనగా అన్నాడు రాజా. శకుంతల మరింత బిగిసి—

"నే నిప్పు డేమీ ఆలోచించలేను. నే నింక ఆ నీరసపు టింటికి—శుష్కజీవితానికి ఏంచేసినా వెళ్లను. నాప్రేమమూర్తి దగ్గరనే నే నుండిపోతాను"

రాజా...కు కర్తవ్యం తోచలేదు. మామయ్య ఇదేమైనా వింటే కొంప మునిగిపోతుంది.—తా నసలు చాలా తెలివి తక్కువపని చేశా నని తాత్కాలికంగా అనుకోక తప్పింది కాదు. తెగించి అన్నాడు—

"శకుంతలా, నిన్ను బతిమాలుకుంటూ: ఇప్పటికి వెళ్ళిపో —వెళ్లు. దీనితో నా పూర్వాచరంతా ధ్వంసమైపోతుంది. క్షమించ మనడంకన్నా ఇప్పు డేమీ చెప్పలేను. నన్నింక హింసించకు—"

శకుంతల విజయగర్వంతో చటాలున విజృంభించి—

"రాజారావ్! ఇప్పటికేనా నీ దుర్బల హృదయం నీకు బోధపడిందా? మొగజాతిది ఎంత తేలిక బుద్ధో అర్థమయిందా? స్త్రీయౌవనవిలాసాలకు గుండె చెదిరి, ప్రేమ అనుకుని ఆత్మ వంచన చేసుకుని ఏ అమాయికఐనా దొరికితే ద్రోహంచేసి తమదారిని పోతారా? ఇకమీదనైనా బుద్ధిగా చదువుకుని బాగుపడు. ప్రేమను గూర్చి ఇప్పుడు నువ్వు నాకు చెప్పిన సూత్రాలను నువ్వు బాగా మననంచెయ్యి.

"ఇట్లా మనం తేలికబుద్ధులతో సంచరిస్తున్నాం గనకనే కాలేజీల గౌరవం గంగలో కలిసింది. అజ్ఞానులూ—సుజ్ఞానులూ ఇందుకే కో ఎడ్యుకేషన్ అంటే చులకనగా మాట్లాడుతారు.

"ఇకమీదనైనా నావలె ఎవ్వరిమనశ్శాంతినీ చెడగొట్టకు. ఇట్లా అన్నందుకు మనస్సులో ఏమీ కించపడకు. ఇట్లా జరిగి నట్లే జ్ఞాపకం ఉంచుకోకుండా—ఈపైని ఆప్తస్నేహితులుగా వుందాం. గుడ్ నైట్!"

జయప్రదంగా, పాంచజన్యంఊదిన ఉత్సాహంతో, నవ్వుతూ శకుంతల మంగతో ... ... ...గబగబ ఇంటిమార్గంపట్టింది.

---